శ్రీరస్తు

శ్రీవేణుగోపాలాయనమః

భక్తసులభ మహిమానువర్ణన పద్యరత్నావళియును,
శ్రీవేణుగోపాలాద్యంకిత గీర్వాణాంధ్ర కర్ణాటక
సంకీర్తన మణిమంజరియును,
శృంగార సంగీతమాలికాపుంజంబును,
మంగళనీరాజన ప్రసూనవితానంబునుం
గలిగి

పండితపామర జనరంజనంబైన

# కవికర్ణామృతము

అనునియ్యది
సురపురీ సంస్థానస్థిత మేల్నాటి
గోష్ఠివర్య రంగయార్య కవిపుంగవ
తనూభవ బుధజనవిధేయ
పూర్వోపాధ్యాయ లక్ష్మయాభిధేయ
ప్రణీతము

---

బ్రహ్మశ్రీ దోరవేడు సాంబశాస్త్రి పరిశోధితము
మ. రా. శ్రీ. కోట్రికబిచ్చయ్య శ్రేష్ఠిగారి ధనసహాయమున

౫౦౦ ప్రతులు

గోలకొండ ముద్రాక్షరశాలయందు
ముద్రించబడియె.
౧౩౪౫ ఫ.

| వ.సం. | విషయసూచిక | | | పు.సం. |
| --- | --- | --- | --- | --- |
| ౧ | పీఠిక | | | |
| ౨ | గ్రంథముద్రణకర్త వంశావళి | (౩౧) | పద్యములు | ౧ |
| ౩ | ,, వంశవృక్షము | | | ౧౨ |
| ౪ | ఇష్టదేవతాస్తుతి | (౧౩) | ,, | ౧౩ |
| ౫ | కర్తృవంశావతారము | (౫౦) | ,, | ౧౭ |
| ౬ | ,, వంశవృక్షము | | | ౨౯ |
| ౭ | కావ్యాధిక్యము | (౮) | ,, | ౩౨ |
| ౮ | షష్ఠ్యంతములు | (౮) | ,, | ౩౪ |
| ౯ | భక్తసులభ మహిమానువర్ణనము | (౨౭) | ,, | ౩౬ |

మొత్తము (౧౩౭) పద్యములు



శ్రీరస్తు

శ్రీవేణుగోపాలాయనమః

భక్తసులభ మహిమానువర్ణన పద్యరత్నావళియును,
శ్రీవేణు గోపాలాద్యంకిత గీర్వాణాంధ్ర కర్ణాటక
సంకీర్తన మణిమంజరియును,
శృంగార సంగీతమాలికాపుంజంబును,
మంగళనీరాజన ప్రసూనవితానంబునుం
గలిగి

పండితపామర జనరంజనంబైన

# కవికర్ణామృతము

అనునియ్యది
సురపురీ సంస్థానస్థిత మేల్నాటి

## గోష్ఠీవర్య రంగయార్య కవిపుంగవ

తనూభవ బుధజనవిధేయ

## పూర్వోపాధ్యాయ లక్ష్మయాభిధేయ

ప్రణీతము

---

బ్రహ్మశ్రీ దోరవేడు సాంబశాస్త్రి పరిశోధితము
ర. రా. శ్రీ. కోట్రికబిచ్చయ్య శ్రేష్ఠిగారి ధనసహాయమున

---

౫౦౦ ప్రతులు

---

గోలకొండ ముద్రాక్షరశాలయందు
ముద్రించబడియె.

# పీఠిక

మహాశయులారా!

శ్రీమత్సురపురీ సంస్థానస్థిత శ్రీవేణుగోపాల మృదుల చరణాంభోజమత్తద్విరేఫాయమానమానస, చాత్తాదశ్రీవైష్ణవ ద్విజషోడశకర్మాధికార, శఠకోపర్షి పవిత్రగోత్ర, త్రిమత స్థాపనాచార్య మహాభాష్యకార యతిసత్పాత్ర, తిరుక్కోవిలూరు మఠాధికార బ్రహ్మశ్రీ శ్రీనివాస రాఘవాచార్య కృతపంచ సంస్కారయుత సమాశ్రయణ, ద్రావిడామ్నాయ ప్రవర్తక, గీర్వాణాంధ్ర కర్ణాటనాటకాలంకార కావ్యకృత, మేల్నాటిగోష్ఠీవర్య రంగయార్య కవిపుంగవ ధర్మపత్నీ పతివ్రతాశిరోమణీ శేషమాంబాగర్భ శుక్తిముక్తాఫలప్రాయరసిక శేఖరలక్ష్మమాభిధేయుండనైన బుధజనవిధేయుండనగు యేను భగవత్కటాక్షంబుచే నార్యాశీర్వాదంబున హైదరాబాదనందగు నైజాము రాష్ట్రప్రభుత్వమువారి యనుగ్రహంబువలనఁ దదితర పాఠశాలా శాఖాధికారుల యనుమతిప్రకారము, శకము. (సన్) ౧౩౦౬ వ సంవత్సరమున (ఫసలీ) నుపాధ్యాయత్వమునకు నంగీకరించి, గొప్ప యుద్యోగస్థుని యాధీనమునను౦డు దేశము. (జిల్లా) గుల్బర్గకుఁజేరిన దానియందొక భాగము. (తాలూకా) కోడంగంటియందును, దత్సంబంధమైన, యధికారులుండు గొప్పగ్రామము(కసుబా) బమరస్పేట, హుసనాబాదు, డాలతాబాదు, మద్దూరు, దామరగిద్ద, చంద్రుక, కానుకుర్తి, యీ యష్టగ్రామముల పాఠశాలలయందుఁ బ్రధాన, సహాయోపాధ్యాయుండనై ప్రవర్తించి, బాలురకు సద్విద్యనుబోధించి, వెన్నలోని వెంద్రుకచందంబున నేకొఱంతలేక శకము. (సన్) ౧౩౨౦ యవ సంవత్సరమున (ఫసలీ) నుపవేతనపరుండనై కడతేఱి, పైపేర్కొనిన డాలతాబాదు గ్రామమునందు గృహక్షేత్రముల సంగ్రహించుకొని యీసమయంబున శ్రీహరిని ధ్యానించుచుఁ గాలక్షేపంబుసల్పువాఁడ.

ఇంతకుఁబూర్వము, పండితజన మనోరంజన పద్మావతీపరిణయమును, రసికజనమనోవికాస రాజశేఖరవిలాసమను నాటకములను గోడంగంటికిఁజేరిన బమరస్పేట గ్రామాధికారులగు విష్ణువృద్ధసగోత్రస్మార భాగవత సాంప్రదాయక బ్రహ్మశ్రీ సీతారామరావు జీవ

ర్రావుగారి ప్రేరేకమున రచియింపంబడి బహుమానముల నందినయనంతరము పైపేర్కొనిన ప్రథమనాటకమును వారచ్చొత్తించి కృతకృత్యులైరి. వారిజామాతయగు, మహబూబ నగరమునకుఁజేరిన వెదిరె గ్రామాధికార గౌతమగోత్ర స్మార్తభాగవత సాంప్రదాయక బ్రహ్మశ్రీ నరసింగరావుగారు శ్వశురాభిమానపరులై పైవ్రాసిచ్చిన ద్వితీయనాటకము నచ్చొత్తించి కృతార్థులైరి. వెండియు వెదిరె గ్రామాధికారి యనుమతంబున గోపాలపేట బ్రహ్మశ్రీ రామచంద్రాచార్య కవివర్యులచే నిర్మింపంబడిన ప్రహ్లాదనాటకమును బరిశీలించి తృప్తింజెందకనన్నుఁ బ్రోత్సాహముఁగావించ వారిమనోభీష్టప్రకారము దన్నాటకమునందుఁబాల్గొని యామూలాగ్రహముగా శక్తికొలంది సవరించి రసవంతమగు నట్లొనర్చుటచేఁ బరమ సంతుష్టాంతరంగులై విశేషబహుమానంబుల నొసంగి వింశతిరూప్యంబులు వర్షాశనము శాసనముగావించి ధన్యులైరి.

కోడంగంటికిఁజేరిన హకీముపేట గ్రామాధికారియైన మోటాటివంశ సంభవుండగు యాసిరెడ్డిగారు ధర్మగుప్త ధరాధీశనాటకమును రచియింపించి సన్మానములసల్పిరి.

కర్ణాకపండిత జనమనోరంజన పద్మావతీపరిణయ నాటకమును, కర్ణాటక పారిజాతాపహరణమును, స్వయముగాఁ గూర్పఁగావించనయ్యె.

భక్తసులభ మహిమానువర్ణన పద్యరత్నావళియును, సురపురీ వేణుగోపాలాద్యంకిత గీర్వాణాంధ్ర కర్ణాటకసంకీర్తన మణిమంజరియును, శృంగారసంగీతమాలికాపుంజంబున్ను, మంగళనీరాజన ప్రసూన వితానంబునుంగలిగి పండితపామర జనరంజనంబైన, కవికర్ణామృతమను, యిప్పొత్తము నచ్చొత్తింప వాగ్దానంబొసంగిన కోడంగల్లు పురీనివాస వైశ్యకులాగ్రేసర కోట్రికభిక్షయాభిధేయుని కృతజ్ఞతకెంతయుఁబాత్రుండ.

ఇట్లు, పూర్వోపాధ్యాయ బుధజనవిధేయ

మేల్కొటి లక్ష్మయాభిధేయుడు

# పీఠిక

మహాశయులారా!

శ్రీమత్సురపురీ సంస్థానస్థిత శ్రీవేణుగోపాల మృదుల చరణాంభోజమత్త ద్విరేఫాయమానమానస, చాత్తాదశ్రీవైష్ణవ ద్విజషోడశకర్మాధికార, శఠకోపర్షి పవిత్రగోత్ర, త్రిమత స్థాపనాచార్య మహాభాష్యకార యతిసత్పుత్ర, తిరుక్కోవిలూరు మఠాధికార బ్రహ్మశ్రీ శ్రీనివాస రాఘవాచార్య కృతపంచ సంస్కారయుత సమాశ్రయణ, ద్రావిడామ్నాయ ప్రవర్తక, గీర్వాణాంధ్ర కర్ణాటనాటకాలంకార కావ్యకృత, మేల్నాటిగోష్ఠీవర్య రంగయార్య కవిపుంగవ ధర్మపత్నీ పతివ్రతాశిరోమణీ శేషమాంబాగర్భ శుక్తిముక్తాఫలప్రాయరసికశేఖరలక్ష్మమాభిధేయుండనైన బుధజనవిధేయుండనగు నేను భగవత్కటాక్షంబుచేనార్యాశీర్వాదంబున హైదరాబాదనందగు నైజాము రాష్ట్ర ప్రభుత్వమువారి యనుగ్రహంబువలనఁ దదితర పాఠశాలా శాఖాధికారుల యనుమతిప్రకారము, శకము. (సన్) ౧౩౦౬ వ సంవత్సరమున (ఫసలీ) నుపాధ్యాయత్వమునకు నంగీకరించి, గొప్ప యుద్యోగస్థుని యాధీనముననుండు దేశము. (జిల్లా) గుల్బర్గకుఁజేరిన దానియందొకభాగము. (తాలూకా) కోడంగంటియందును, దత్సంబంధమైన, యధికారులుండు గొప్పగ్రామము(కసుబా) బమరస్పేట, హుసనాబాదు, డాలతాబాదు, మద్దూరు, దామరగిద్ద, చంద్రుక, కానుకుర్తి, యీ యష్టగ్రామముల పాఠశాలలయందుఁ బ్రధాన, సహోపాధ్యాయుండనై ప్రవర్తించి, బాలురకు సద్విద్యనుబోధించి, వెన్నలోని వెంద్రుకచందంబున నేకొఱంతలేక శకము. (సన్) ౧౩౪౦ యువ సంవత్సరమున (ఫసలీ) నుపవేతనపరుండనై కడతేఱి, పై పేర్కొనిన డాలతాబాదు గ్రామమునందు గృహక్షేత్రముల సంగ్రహించుకొని యీసమయంబున శ్రీహరిని ధ్యానించుచుఁ గాలక్షేపంబుసల్పువాఁడ.

ఇంతకుఁబూర్వము, పండితజన మనోరంజన పద్మావతీపరిణయమును, రసికజనమనోవికాస రాజశేఖరవిలాసమను నాటకములను గోడంగంటికిఁజేరిన బమరస్పేట గ్రామాధికారులగు విష్ణువృద్ధసగోత్రస్మార్త భాగవత సాంప్రదాయక బ్రహ్మశ్రీ సీతారామరావు జీవ

రావుగారి ప్రేరితమున రచియింపఁబడి బహుమానముల నందినయనంతరము పైఁబేర్కొనిన ప్రథమనాటకమును వారచ్చొత్తించి కృతకృత్యులైరి. వారిజామాతయగు, మహబూబ నగరమునకుఁజేరిన వెదిరె గ్రామాధికార గౌతమగోత్ర స్మార్తభాగవత సాంప్రదాయక బ్రహ్మశ్రీ నరసింగరావుగారు శ్వశురాభిమానపరులై పైవ్రాకుచ్చిన ద్వితీయనాటకము నచ్చొత్తించి కృతార్థులైరి. వెండియు వెదిరె గ్రామాధికారి యనుమతంబున గోపాలపేట బ్రహ్మశ్రీ రామచంద్రాచార్య కవివర్యులచే నిర్మింపంబడిన ప్రహ్లాదనాటకమును బరిశీలించి తృప్తిం జెందకనన్నుఁ బ్రోత్సాహముఁగావించ వారిమనోభీష్టప్రకారము దన్నాటకమునందుఁబాల్గొని యామూలాగ్రహముగా శక్తికొలంది సవరించి రసవంతమగు నట్లొనర్చుటచేఁ బరమ సంతుష్టాంతరంగులై విశేషబహుమానంబుల నొసంగి వింశతిరూప్యంబులు వర్షాశనము శాసనముగావించి ధన్యులైరి.

కోడంగంటికిఁజేరిన హాకీముపేట గ్రామాధికారియైన మోటాటివంశ సంభవుండగు యాసిరెడ్డిగారు ధర్మగుప్త ధరాధీశనాటకమును రచియింపించి సన్మానములసల్పిరి.

కర్ణాకపండిత జనమనోరంజన పద్మావతీపరిణయ నాటకమును, కర్ణాటక పారిజాతాపహరణమును, స్వయముగాఁ గూర్పుఁగావించనయ్యె.

భక్తసులభ మహిమానువర్ణన పద్యరత్నావళియును, సురపురీ వేణుగోపాలాద్యంకిత గీర్వాణాంధ్ర కర్ణాటకసంకీర్తన మణిమంజరియును, శృంగారసంగీతమాలికాపుంజంబును, మంగళనీరాజన ప్రసూన వితానంబునుంగలిగి పండితపామర జనరంజనంబైన, కవికర్ణామృతమను, యిప్పొత్తము నచ్చొత్తింప వాగ్దానంబొసంగిన కోడంగల్లు పురీనివాస వైశ్యకులాగ్రేసర కోట్రికభిక్షయాభిధేయుని కృతజ్ఞతకెంతయుఁబాత్రుఁడ.

ఇట్లు, పూర్వోపాధ్యాయ బుధజనవిధేయ

**మేల్నాటి లక్ష్మయాభిధేయుడు**

# గ్రంథముద్రణకర్త వంశావళి



శ్రీమత్కొడంగల్లుపురీ నివాస వైశ్యకులాగ్రేసర కోట్రికభిక్ష
యాభిధేయుని వంశానుక్రమాభివర్ణనము.

శా॥ శ్రీనారిన్నుభలగ్న మందలరితాఁ గ్రేగంటనీక్షింపనే
త్రానూనాబ్జయుగంబుడంబుగను ముద్రాముద్రితంబైతగ
న్నామస్లాంచినరించిమించిపొగడ న్నా వేంకటాద్రీశ్వరుం
డౌనెంచన్గుణివైశ్యభిక్షయమణి న్హర్షంబునం బ్రోవుతన్॥

తే॥గీ॥ కలిమిచానకుభూషణావలుల పేటి
పంటవలతికిఁజెక్కుంపు పసిఁడికుప్ప
యాచకౌఘమునకుసార నైచికియన
భువిఁదనర్చు కొడంగలు పురవరంబు॥

శా॥ శ్రీవత్సామలగోత్రవర్యులు రమాసీమంతినీసుస్థితు
ల్భావింపన్సుగుణావతంసులు వరాపస్తంబసూత్రాఢ్యులు
న్దేవన్వేంకటశైలనాథ పదకంజాతార్చకుల్వర్తక
ప్రావీణ్యుల్ధరభిక్షయాభిధసుధీవంశాగ్రణుల్పొల్చిరా॥

సీ॥ హరుఁడుమిత్రుండని మురియుచుండెనుగాని
సఖునిభిక్షముమాన్పఁ జాలెనొక్కొ
తారాద్రిచెంత సదాస్థితుండై బహు
నిధులనార్జింపంగనేర్చెనొక్కొ
కొలఁగాకధనమొక కోణమందనిశంబుఁ
బడియుండ పేరము ల్నడిపెనొక్కొ

శ్రీదుఁడై నందున మోదమందెనుగాని
యిక్కొ-అంతలుగల్గు పెటిఁగెనొక్కొ-

తే॥గీ॥ యనుచు జక్కులతేనిహాస్యంబుసల్పి
సంఖ్యలకుమించి విత్తంబుసంగ్రహించి
కలిమిచేనొప్పదురు కొండంగంటిపురిని
వైశ్యమణులైన కోట్రికవారలార॥

మ॥ విదితంబైతగుకోట్రికాన్వయమున న్విఖ్యాతచారిత్రులై
పెదగోవిందయసెట్టిజెట్టి చినగోవిందార్యుఁడుంబుట్టి కో
విదులానాననిసన్నుతుల్సలుప సద్విద్యాధికోపేతులై
ముదమారన్బలరామకృష్ణులబలెంబుణ్యాత్ములై పొల్చిరా॥

క॥ ధీరుఁడుపెదగోవిందయ
మారసమానాకృతులఁగు మారులలక్ష్మీ
నారాయణసన్నాముని
గౌరవయుతులింగయార్యుఁ గని ముదమందెన్॥

శా॥ గోవిందాత్మజులైనయాత్మ భువులన్శోభించుచుంబోలిరా
ధీవామాకృతులంగ్రమంబున ధరన్దీర్ఘాయురారోగ్య వి
ద్యావాగ్వైభవులై మెలంగిరి హరిధ్యానైకపారీణులై
గోవిందాత్మజులంచుబల్కఁదగు బోగోప్యంబునింకేటికిన్॥

తే॥గీ॥ శంకరుఁడు సామజాననషడ్వదనుల
గనినచాడ్పునసుమతి లింగయసమాఖ్యుఁ
డందముగ వేంకయార్యు గోవిందయార్యుఁ
బడసిసంతానవృద్ధిచేఁ బరిఢవిల్లె॥

మ॥ ఘనలింగాఖ్యవదాన్యు జ్యేష్ఠసుతుఁడా గంభీరపాథోధి వ
ర్యునికీర్తిందుసుధాబ్ధిహంసకరిభి ద్యోవృమేభడిండీరచం
దనసంతానసురాపగాభి దురరుక్తారాద్రిసచ్చారదా
ఘనసారంబులఁగేరివెల్లి విరిసెన్గాత్మచక్రమందంతటన్॥

తే॥గీ॥ వేంకటాద్రీశ్వరుఁడుమున్ను వేడ్కఁ జేత
నలరి పద్మావతిని బెండ్లియైనభాతి
సిరులఁదనరారి వేంకయసెట్టిపుల్ల
మాంబనుద్వాహమై పొల్చెహర్షమెసఁగ॥

క॥ వరపుల్లాంబామణియం
దరుదుగ ధీశాలి వేంకయార్యుఁడువరుస
న్నరసింహాభిధు ధాకా
ఖ్యునిలింగయనామధేయుఁ గనివిలసిల్లెన్॥

ఉ॥ వెన్నుఁడురక్షణత్వమున వెన్నలఁ జేఁడువితీర్ణమందు వే
గన్నులవాఁడు భోగమున గన్నులవిల్తుఁడుసోయగంబునం
బన్నగరాట్టు బుద్ధిని గృపన్నయసింధువరుండు ధాత్రియం
దన్నవనారసింహుఁడు వియన్నదిఁ గేరిచెలంగెఁ గీర్తిచేన్॥

క॥ గిరిశుఁడు గౌరీతరుణిని
గరమరుదుగఁ బెండ్లియైన కరణిన్ధరణి
న్నరసింహానామధేయుఁడు
వరగౌరాంబనువరించి పరిణయమయ్యెన్॥

ఉ॥ ముగ్గురుమూర్తులోయనఁగ బుట్టిరి గౌరమగర్భవాసులై
యిగ్గతి శ్రేయమిషీసహితుఁ డెల్లయజ్యేష్ఠతనూజుఁడై తగ
న్నగ్గనిరక్షణత్వమున సభ్యుఁడు రామయపొల్చెమాన్యుఁడై
యగ్గలమైనసంపదల నందెను వేంకయ సార్థకంబుగాన్॥

సీ॥ చిందంబుమగ జాల సింగంబు రేజేని
మినుహాఁకడా యంచమిన్కుఁ గేరి
నలువపడంతి వెన్నెలపోరుదిండీని
చిలువల యెకిమీని చెలువుఁ దెగడి
వేగంటివాలుపా ల్వెల్లిసుప్వాణి
జేజేలబాబా రెల్లుజిగి నెదిర్చి

వెలిమ్రానుముక్కంటి వలిగట్టుమడికాసు
కప్పురాల తెలిదమ్మి కాంతి నెంచి॥

తే॥గీ॥ మేటిపుల్గులదొర మోముఁ దాటిసిడెము
దారి వేల్పులగిడ్డి చౌదంతి రిక్క-
నుఱుఁగుఁ జలితరి మబ్బుల మెఱుఁగుదూతి
వసుధఁ దనరారె రామయవర్యుకీర్తి॥

చ॥ అరయ విరించి శౌరి త్రిపురాంతకులర్థిని శారద న్రమా
తరుణిని బార్వతిన్వరుసఁ దప్పకఁ బెండిలియైన చాడ్పున
స్వరమతి యెల్లయార్యుఁడు సబంధుఁడు రామయ వేంకయార్యుఁడు
న్సరవిని శేషమన్వినయచారిణి శేషమసాయమాంబలం
బరిణయమంది భాసిలిరి వైశ్యకులాగ్రణులై వసుంధరన్॥

రామయార్యుని జాయాశిరోమణి

క॥ తానన్నపూర్ణయై పతి
హీనత్వము చేత భిక్షమెత్తుచునుండ
న్మానుపదంచునుగిరికా
మానిని నెదిరించి శేషమాంబ చెలంగెన్॥

తే॥గీ॥ పాండుపార్థివచంద్రుని భార్యయైన
కుంతికిని బార్థుఁడుదయించి సంతసిలిన
పగిది కోట్రిక రామయ పత్నియైన
శేషమకుఁ బుట్టి ఫుల్లయసెట్టి దనరె॥

సీ॥ శారదాశారద నారద నారద
పారపారదమార మారగిరులఁ
దారతారకతారతారాహిసం
హారహారనీహారహారాంగరుచుల
సారసఘనసార సౌరసైంధవసార
సారబృందారమందారగతుల

గాఢపాకాఢాపగా నీకాశకాశ
రాకానిశాకరనాకకరుల

తే॥గీ॥ మించిభువిఁదనకీర్తి వర్తించసాగె
నంచుసరసులుగొనియాడ హర్షమునను
వైశ్యకులవార్ధి చంద్రుఁడై వాసికెక్కి
పుల్లయార్యుండుదాతయై యుల్లసిల్లె॥

సీ॥ తలవాకిటవలంతిఁదగ జేర్చుకొనిచాల
మేటియాచతురాస్యు మేధయెంత
మాటిమాటికిబెక్కు మాధ్యంబుధరియించు
వరసురాచార్యుని ప్రజ్ఞయెంత
సతతంబుభాసిల్లు శ్రుతిహీనుడైనట్టి
చిలువతేనిమనీష చెలఁగునెంత
సరగ శుకాఖ్యునిస్వాంతేహతంగన్న
వ్యాసర్షివాక్ప్రౌఢివటులునెంత

తే॥గీ॥ యనుచువారలనిరసించి ఘనతవడసి
కవసమునన్ప్రవీణతఁగాంచిమించి
వైభవంబుననిర్జరపతినిదెగడి
చెలఁగెకోట్రికపుల్లయసెట్టిజెట్టి॥

సీ॥ కోట్రికాన్వయవార్ధి కుముదబాంధవ్రుడనం
దనరాంకికలిమిచేధనదుఁగేరి
పారకృష్ణార్జున సంవాదమనుగయో
పాఖ్యానమొనరించి హర్షమెసఁగ
శృంగారయుక్తమౌ సంగీతములరచి
యి.చిముద్రణముగావించిమించి
మహికవిశ్రేష్ఠుఁడౌ మజ్జనకునిచంత
నరసభూపాలీయ మరసి యభ్య

క్షీరసాగరకన్యను గేరిలక్ష్మ
మాంబసుగుణకదంబయై మహిం జెలంగె॥

తే॥గీ॥ లక్ష్మమాంబికయందు సలక్షణముగ
రంగనాథు నృసింహులు నెసంగుచంద్ర
శేఖరుని గాంచి భిక్షయసెట్టి చెలంగె
వంశమభివృద్ధిం జెంద నిస్సంశయమున॥

కం॥ మారులు చెలువంబున సుకు
మారులు ధీరత్వమునం గుమారులు మహిసో
మారులు గారిచ్చిన్నిక్రొ
మారులు భిక్షయకుం బొడమిమలయుదు రెలమిన్॥

పై గ్రంథముద్రణకర్త దివ్యక్షేత్రముల యాత్రసల్పిన ప్రస్తావము

సీ॥ కృష్ణాఘనుష్కోటి విష్ణుకంచిజిదంబ
రముగాళహస్తి శ్రీరంగవరముం
దిరుపతిశివకంచిం దిరుచనాపల్లిస
ద్రామేశ్వరము మధురాపురంబు
బక్షితీర్థంబును బంఢరిం గుంభకో
ణము గయాభద్రాచలముం బ్రయాగ
మునుజంబుకేశ్వరమును జగన్నాథంబు
సింహాచలంబుం గాశీనగరము

తే॥గీ॥ లలితగోదావరిని మంగళగిరి నెలమి
దక్షిణోత్తర దివ్యయాత్రలనుగన్న
తండ్రి దనతోడంజను దేరం దనరసల్పి
ఖ్యాతింబడసెను వైశ్యాగ్రగణ్యుండైన
భిక్షయాఖ్యుండు బంధుసంరక్షకుండు॥

ఉ॥ భూవలయప్రశస్తసుత పోవిభవుండు ననూనపుణ్యసం
భావితమూర్తి శ్రీయుతుండు వత్సమునీంద్రుండు బ్రహ్మవేదివి
ద్యావిజితాదిపన్నగుండునై యతి నంఘను సేవితుండునై
పావనసద్గుణుండు నయ భాసిలెదిగ్వినుత ప్రకీర్తి చేన్॥

ఉ॥ పావనతన్మునీశ్వరుని వంశమునందలకోట్రికాన్వయం
బీవసుధం గొడంగలు పురీంద్రమునందుఁ జెలంగెనారవి
ద్యావిహితుల్సమస్తసుగుణాన్వితు లార్యజనానుసేవనా
కోవిదులైనవారు నలఘుల్జనియించుకతంబునంగదా॥

ఉ॥ అందుజనించిమించె సముదంచితకీర్తి నిగాంచిశ్రీలచే
తందనరారియాచకుల దాతయటంచువిశాలపాండితీ
మందిరపండితప్రవరమాన్యతలన్విలసించిపెద్దగో
విందసమాహ్వయుండుసమవిణ్మణులందుసెబాసునొందుచున్

ఉ॥ ఆతనివంశమందు నుదయంబునుగాంచెరమాకళత్రవి
స్ఫీతపదాంబురుడ్యుగళ విశ్రుతసన్మకరందబిందు సం
ఘాతసుపానతుందిల మనస్కుఁడురమ్య కవిత్వధోరణీ
ప్రీతకవిప్రకాండుఁడు విభీతజనాదృతిపుల్లయాఖ్యుఁడై॥

చ॥ పురుసుకళావితానమునఁ బుష్కరవైరినిఁ బుష్కరేశ్వరుం
బురువిభవాభిరామమున బుష్కరపాలునిఁ బుష్కరాంబకుం
బురుతనుశోభనంబునను బుష్కరకేశునిఁ బుష్కరాంబకు
న్వరుసజయించిమించె ననివార్యుఁడుపుల్లవిడింద్రుడిద్ధరన్ ।౩౬

సీ॥ ద్విజనాయకునిమించి ద్విజులనుబోషించెఁ
దన సుకళాప్రభా ఘనతచేతఁ
గవిరాజునలయించి కవులనుదరిఁజేర్చెఁ
దనకవిత్వప్రభా ఘనతచేత
గురువునువంచించి గురువులఁబూజించెఁ
దనమనీషాప్రభా ఘనతచేత
బుధునవమానించి బుధులగోష్ఠిఁజెలంగె
దనదువిజ్ఞానస ద్ఘనతచేత

తే॥గీ॥ నతఁడు సామాన్యుఁడేబలాహ కవితరణ
వారపూరప్రపూరితవార్యదీన
వాయఁడద్రిసుధీకాఁడ పారయశుఁడు
పుల్లయాభిధసత్కవితల్లజుండు॥

చ॥ సరసకవిత్వవైఖరుల సత్యవచోవిభవంబు నందుఁ శ్రీ
ధరపదపంకజార్చనలఁ దత్పదభక్తసుసేవనారతి
న్నిరుపమదానశీలతను నిర్మలతన్సుయశోభిరామత
న్ధరణినిబుల్లయార్యునకుఁ దార్కొని యేమనుజుండునీడగున్॥
చ॥ పరమపతివ్రతాతిలక భర్తృనుగామిని పంకజాలయా
చరణసరోజసేవనల సంతతకాలము పుచ్చుసద్గుణా
కరపరిపూతభాసజిత కంతుసతీశత వేపసాయమా
ఖ్యరహినిమించుఁ బుల్లయవరాంగన యంగనలందు మేటిరై॥
ఉ॥ ఆమిథునంబు శ్రీహరికటాక్షమునం బడసెంగుమారుగా
నామదనాభిరాముని గుణాన్వితునిర్మల కీర్తిసాంద్రు వి
ద్యామహితున్వదాన్యుని సుధామధురోక్తివిశారదుంగవి
ప్రేమునిసత్యసద్వినయు భిక్షయనాముని శ్రీసుధామునిన్॥
సీ॥ జలదంబులను దగుసాటిఁగవచ్చుఁ
జలనంబులేకుండ మెలగుచున్న
బలిచక్రవర్తి నేర్పరచిచెప్పఁగవచ్చు
దానవత్వంబును బూనకున్న
నానిశాపతిని సమానంబుఁ దేవచ్చు
దోషాకరత్వంబు దొఱయకున్న
గిరిజేశ్వరునిబిల్చి సరిగూర్చగావచ్చుఁ
గొండగుహాలలోన నుండకున్న
తే॥గీ॥ నితనికీతండె యసమానగతిఁ జెలంగు
సతతసత్కవిపండితా దృతిని జేసి
క్షితి నసామ్యతకీర్తి సంగతినిబొందె
భిక్షయార్యుండు సుగుణవిలక్షణుండు॥
చ॥ ధనముఁబొసంగ విద్యలకుఁ దావుఁబొసంగదు విద్యలుండిన
న్ధనమతిదూరమేగు నికదాతదరిద్రుఁడు భూరిలోభియా
ధనికుఁడుదద్విధంబుమ నధార్మికుఁడై విలసిల్లుభిక్షయా
ఖ్యునికడలేదు విత్తముకళోర్జితశక్తియుదానముండెడున్॥

చ॥ సిరిఁగలమూర్ఖులోభి గుణశీలుఁడుగాక నహంకృతాత్ముఁడై
వరకవిపండితావళినిఁ బర్వినదుర్మతిప్రేతరాజ దు
ర్భరభట సంచయంబువలె రక్కసిబంట్లనుఁబోలెఁజూచునా
దురితగుణంబు సుంతయినఁదూఱదు భిక్షయమానసంబునన్॥

సీ॥ ఆమహితుండు లక్ష్మ్యభిధయాసతీ
తిలకంబునందు సలలితగతిని
త్రేతాగ్నులంబోలెఁ దేజరిల్లెడుసుత
త్రయమునుగాంచెను రంగనాథు
నరసింహనాముని వరచంద్రశేఖరుఁ
జనువానిపితరుల ఋణమువాయఁ
బుత్రత్రయముగూడి పొలుపారుసిరులచే
సతతసౌభాగ్య సంగతులచేత

తే॥గీ॥ వేంకటేశ్వర సత్కృపా విలసనమున
భిక్షయార్యుండు పండితవిబుధసుకవి
జనులమన్నించి మర్యాదఁగొనుచునుండ
దీవనలనిచ్చు చున్నాడ భావమలర॥

చ॥ నరులగుణంబులెన్నగను నారసనంబుపథంబుఁద్రొక్కక
న్మరయుచునుండగావిదిత మేకద నీ కిలభిక్షయార్య వి
ద్వరునిగుణాతిరేకములు భావమునిండగవ్రాసినాడనో
హరిననుఁదప్పులెన్నకమహాదయతోడుతఁబ్రోచుచుండుమా।

(౧౨ వ పేజీలో వంశవృక్షము చూడుడు)

## గ్రంథముద్రణకర్త వంశవృక్షము.



శ్రీవేణుగోపాలాయనమః

# కవికర్ణామృతము



## ఇష్టదేవతాస్తుతి.

శా॥ శ్రీవైదర్భిసరోజసక్తభసలశ్రేణిం బొలగించన
త్త్వాపుంబాసి ముఖాంబుజంబునఁ బడందన్వంగిభీతిల్లిరా
భావంబాత్మనెఱింగి గంధఫలులంబై చల్లియత్తేఁటులం
బోవంజేసినకృష్ణుఁడెప్పుడు మముంబోల్పారఁగాఁ బ్రోవుతన్॥

సీ॥ మెఱుఁగారువదనంబు సరసిజంబులఁగేరి
విధుమాడ్కిఁ దద్దయువెలయుచుండఁ
జెలువొందురోమాళి యళులనునిరసించి
హరిభంగిసంతతంబలరుచుండఁ
బరికింపవేనలి వారిదంబులదూఱి
యేడ్తెఱంగృష్ణత్వ మెసఁగుచుండ
భావింపలేఁగౌను పంచాస్యమునునవ్వి
రహినసంతవిధంబుఁ గ్రాలుచుండ

తే॥గీ॥ దనరువాతెఱ బంధూకమునుహసించి
మాధవస్ఫూర్తి వెలసిల్ల మహినదదయ
నంబులంతట శౌరిభావంబుఁజెంది
పొసఁగుసిరిమాకు సంపదలొసఁగుఁగాత।

మ॥ పరఁగన్భారతిక్రొప్పు వారిదముఁగాభావించి తానెక్కుహం
సరహిస్ఫీతిఁ వహించి యేగునని బల్భక్తించి సందేహతం
ద్వరగా వాణిసినై జనక్కృముఁన నిత్యంబొప్పుగాఁదాల్చుచు
స్వరసత్వంబునఁబొల్చు ధాతనుఁదాజై వాత్సల్యకుం జేయుతన్॥

సీ॥ ప్రోల్లసద్వల్లకీ పుస్తకాంచితపాణి
రాజతాసితఫణి రాజవేణి
వినయనిరంతర వినుత మునిశ్రేణి
మకరందనవసుధా మధురవాణి
చాంచల్యమోచన చకితసంజ్వలదేణీ
దక్షిణభుజకసద్వరకృపాణి
కైవల్యహార్మ్యాగ్ర కాంచననిశ్రేణి
యంచ తేజీనెక్కు మించుబోణి

తే॥గీ॥ యాచితేంద్రాణి సర్వవిద్యాధికాణి
సన్నుతాఖిలగీర్వాణి స్మరవధూని
పులినజచ్ఛ్రోణిజాణయా నలువరాణి
కలితకల్యాణి ధీనిచ్చుఁగాతవాణి॥

ఉ॥ ఇందునిభాననార్య వలపెక్కఁగ నంకముఁ జేరఁబోయిచె
న్నొందహిహారరాజిఁగని యోర్వక సాధ్వసమందినిల్వఁగా
సందియమేలబర్హకచ చయ్యనరాఁ దగునంచుఁ బేర్మిచే
సందిటనుంచిముద్దులిడు శంకరుఁడిచ్చువిభూతులర్మిలిన్॥

చ॥ కటికిమలజ్జనించినెఱిఁగ్రాలెడి నిన్నుఁగరంపనావశం
బెటులగునంచునాడితి గిరీశుఁడ నీకిది భూరికార్యమే
తటుకునఁబైఁడిగుబ్బలిని దద్దయువిల్లుగవాంచినట్టి ధూ
ర్జటివికదాకడంగివలిచట్టు కొమారిఁగరంచుచక్కఁ దు
ర్ఘటమెయటంచుఁబల్కుశివ కాంతయొసంగుతమాకభీష్టముల్॥

చ॥ అరయదటాలునజ్జన నియంకతలంబునుడాయఁబోయిని
ర్భరగతిచేఁదదీయజు హలారాణముఁగాంచి మదింపలకగా
నురుశరభాగ్రిమత్వ మిరవొందిననీకళు కొందుకంచు న
గ్గిరిజనచింపఁజేరఁజని క్రీడయొనర్చుచు మోదచిత్తుఁడౌ
ద్విరదముఖుండుమత్కృతికి వేమఱువిఘ్నమొనర్పఁగావుతన్॥

సీ॥ ఆదియుగంబునం దబ్జాత్మునకుమృదు
తల్పమై శేషాఖ్యఁధనరిపిదప

రెండవమాఱొగి న్నిండువేడ్కఁదలిర్ప
రామానుజన్ముఁడై రహిఁజెలంగి
మూఁడవసారి సమోన్మదహృత్కమలుఁడై
బలరామసంజ్ఞచేఁ బరిఢవిల్లి
పరికింపనాలవ పారిసజానూరి
కేశవాచార్యుల కేవలాత్మ
తే॥గీ॥ పత్ని కాంతీమతీ సతీరత్న గర్భ
జలధిరాకాసుధాంశుఁడై జననమంది
త్రిమత సంస్థాపనుండన దేజరిల్లి
నట్టిశ్రీభాష్యకారునే నభినుతింతు॥
సీ॥ పరమసత్త్వావాస పరుఁడగువాగను
శాసనుచతురాస్య సరణిఁబొగడి
బహుముఖవక్త్రయౌ రహిఁగుండలీంద్రుని
పదగూఢభావంబుఁ బ్రస్తుతించి
లలితవైదర్భిచేఁ జెలగుశ్రీనాథుని
పురుషసింహత్వంబు సరగఁదలచి
విబుధవత్సలుఁడని విలసిల్లుసోముని
సన్మార్గగతులను సంస్మరించి
॥గీ॥ కవివితానంబునకుమేలుఁ గలుగఁజేయు
భాస్కరునివృత్తనియమప్రభావసమితి
నభినుతించియు నితరపూర్వాంధ్రకార్య
స్వజనకౌశలకోవిదవ్రజముఁగొల్చి॥
క॥ ననులక్షణాన్వితునిగా
నొనరించి కవిత్వసరణియుందెలియంజే
సినమజ్జనకుండౌ కవి
జనపుంగవరంగయార్యు స్మరియింతు నెదన్॥
౦॥ తే॥గీ॥ ఆదికవిసార్వభౌముల కైననెఱసు
లుండుననవేళ పరులకు నుర్వినెనవ

రించఁగలతావునను సవరించుటొప్పు,
గాన సవరించరానిచోఁ గరముగార
వించి నాతప్పితములు మన్నించవలయు॥

వ॥ ఇవ్విధంబున వర్తమానాంధ్ర కవీంద్రులంగొనియాడి॥

పం॥ తే॥గీ॥ క్షితినిగోశంబు లరసిపోషింపవలయుఁ
బిదపనాలింపఁ జనునుగోవిదులఁబ్రశ్న
సేయఁదగుఁ గడుమదిని మోచింపుటొప్పు
నెచటనెఱుఁగనిచో నేరమెంచఁగూడ
దనుచునేభావిలోకుల నభినుతింతు॥

వ॥ భక్తపరాధీనుండగు భగవత్ప్రేరితుండనై నిర్మింపంబూనిన నవ్యతరకావ్యం బవిఘ్నంబుగా సమాప్తినొందుట కభిలేష్ట దేవతాప్రణుతియు, నాచార్యవర్యులనుతియును, సకలసత్కవిప్రవరుల లస్తోత్యంబును, మజ్జనకుని సంస్మరణంబునుంగావించి జన్మసాఫల్యంబుకొఱకు మదీయవంశానతార క్రమంబభివర్ణించెద॥

సీ॥ మేటివిద్యలవాగ్వ ధూటీశునైనను
బాటింపలేరుమే ల్నాటివారు
పాటిఁదప్పమటంచు మాటిమాటికివిధిఁ
జాటించువారు మేల్నాటివారు
నాఁటగోలంబెను పీటిరాయులచెంత
నేపైనవారుమేల్నాటివారు
కోటిబుధులయందు మాటలచేదొట్టు
పాటొందఁబోరుమేల్నాటివారు

తే॥గీ॥ మోటునడకలఁబోరు మేల్నాటివారు
బూటకులుగారు తారుమేల్నాటివారు
సాటిలేనట్టికృత్తుల్లుమేల్నాటివారు
సీటుగుల్కెడువారుమేల్నాటివారు॥

తే॥గీ॥ అట్టిమేల్నాటివారి వంశాబ్ధిశుభ్రుడ
బాంధవుండనఁబోడిమి సద్బంధులోక

దేవమణియీతఁడనఘవిందేజరిల్లె
జెన్నయార్యభిషఙ్మౌళిచెన్నసంగి॥

తే॥గీ॥ మున్ను శఠకోపమునిగోత్రమునఁజెలంగి
సూరి రామానుజాచార్య సూత్రయోగ్యుఁ
డగుచుసద్వైష్ణవాగ్రిముఁడనమదీయ
వంశమునఁ జెన్నయార్యుండువాసికెక్కె॥

వ॥ అనంతరంబ.

చ॥ పొలుపుగభక్తసంఘములఁ బ్రోచుటకై మదిలోఁదలంచిదా
నిలవసుదేవపత్ని కుదయించినహరి మురారిరీతిగా
నలతిరునామధారుల ద్వయంబునఁగావగ గోరిచెన్నయా
ర్యులసతికింజనించె బ్రపరుండుమురారి సమాఖ్యుఁడెంచగన్॥

చ॥ ఉరగశయానుఁడయ్యు సతతోదధిమధ్య నికేతనస్థుఁడై
గరుడపత్రినెక్కి గతి గానకబిచ్చము నెత్తిమృత్తికా
భరధరుఁడయ్యుపుణ్యజన భంజనుఁడైనమురారియీడునేఁ
డరయఁగవచ్చునేభువిని హరిమురారిభిషగ్బలారికిన్॥

సీ॥ అచ్యుతత్వముమహైశ్వర్యతతియందు
గనదనంతవిభూతి కళలయందు
మాధవస్ఫురణంపు మంజులోక్తులయందు
సుమనఃప్రసన్నతచూడ్కులందు
హేమాంశుకస్ఫూర్తి భామగాత్రమునందు
విధుభావమానన విభవమందుఁ
గృష్ణప్రభావంబు బృధుకనీనికలందు
విశదమాహారిలీల యశమునందు

తే॥గీ॥ వెలయభావించి తిలకించవిష్ణుమయత
యితనియందునసింప సత్కృతులెత్తింగి
విలసదన్వర్థనామంబు వేడ్కనిడగ
మహిమురారి బుధేంద్రుండురహిఁజెలంగె॥

తే॥గీ॥ అంతనాభవ్యుఁడర్ధాంగి యందు వేంక
యార్య శేఖర గోవింద యార్యుఁ గాంచె
రామచంద్రుండు నిజసతీ రత్నమందు
గుశలవులఁ గన్న చాడ్పునఁ గుశలమునను॥

వ॥ అట్టి కుమారద్వితయంబునందు.

సీసమాలిక॥

శ్రీమించు కాంచీపురీనివాసుండగు వరదరాజస్వామి చరణకమల
మత్తమిళిందాయమానమానసుడై సుజనులచేఁ జాలమన్ననలఁ [జెంది
శఠకోపమునిగోత్రజలధితారేశుఁడై భాసిల్లుచును మహాభాష్యకార
యతిసూత్రయోగ్యుఁడై క్షితిఖ్యాతిఁ గన్న బిజాపూరుమహార [దల్లాసాసాదు
షాప్రదత్తవిచిత్ర చామరాందోళికా చ్ఛత్రముల్ చేకొని సమ్మ [దమున
నాఁడుమద్రికిసమ్ము నాడగాఁడనమించి చర్చింపఁ దన్మ్లేచ్ఛచక్రవర్తి
కరుణచేతను బళగానూరుగ్రామంబు నందు సత్క్షేత్రంబులర్థిఁ బ్రాప్తిఁ॥

తే॥గీ॥ జేసికొని సంతతానంద చిత్తుఁడగుచు
దనరి లుక్మాన్హకీము చందమునఁ గరము
వాసికెక్కిన యూనాని వైద్యుఁడనఁగ
నెలమి మెప్పులనడసి భూతలమునందు
వైష్ణవాగ్రణి నాగవర్ధిష్ణుఁడైన
పరమగోవిందయార్యుండు పరిఢవిల్లె॥

శా॥ శ్రీవర్ధిష్ణునికేతనోజ్జ్వలుఁడు సంశ్లేషార్ద్రవుండాత్మభూ
సేవాహ్లాదుఁడు శంఖచక్రసుకరస్ఫీతుండు భద్రాభిధాం
ఛావేశుండరుణాబ్జలోచనుఁడు సత్యాసక్తచిత్తుండగా
గోవిందుండనఁ బొల్చె నామ సమతన్ గోవిందయార్యుండిలన్॥

తే॥గీ॥ అట్టిగోవిందయార్యుఁ డర్ధాంగియందు
భవ్యుఁడౌ కొండయార్యునిఁ బడసెనతఁడు
ధరణిఁ దరికొండ నద్భుతధైర్యమునను
హేళనమొనర్చి విబుధరింఛోళిపొగడ॥

శా॥ గోవిందాత్మజుఁడైన బ్రహ్మ నిజమాకొండాభిధేయుండుదా
భావింపంజతురాననుండు విలసద్భాషావిలాసుండు స
త్త్వావాసైకపరుండు సర్వవిబుధాహ్లాద ప్రదుండెంచఁగా
గోవిందార్యతనూజుఁడై నెగడు నేగోష్యంబునిం కేటికిన్॥

తే॥గీ॥ భార్యయందాతఁ డాళ్వారయార్యునంబు
లార్యపుంగవుఁ గాంచె నౌదార్యశాలి
మానవిధిపాండుభూపతి మాద్రియందు
ఘన నకులసహదేవులం గన్నమాడ్కి॥

వ॥ తదనంతరంబ.

తే॥గీ॥ చనఁగనాసూరి కేశవాచార్యసతికి
భాష్యకారులుద్భోడమిన పగిదిభువిని
గొండయార్యభిషజ్మౌళి కూర్మిసతికి
లక్ష్మయామాత్యుఁడుదయించి లలిఁదనర్చె॥

వ॥ తత్పుత్రత్రితయంబునందు సురపురీసంస్థానాధీశ్వర కోసలాన్వయాగ్రేసర రాజాబలవంత బహిరీబహాదరు జబరన్మల్కమొుతహారుద్దాలా రువాఁబ, జంగ్బిరుదాంకిత పీతాంబరబహిరి పిడ్డినాయకభూమిభృద్వర ప్రధానశేఖరుండనంబొల్చి బీర్నళ్లిజాగీరుదారుఁడన శోభిల్లి, శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్యోభయ వేదాంతవర్తక పరమహంస పరివ్రాజకాచార్య శ్రీరంగరాజ భట్టారక దత్తబ్రహ్మరథ మహోత్సవ విభవ విరాజమాన శ్రీమత్తిరుక్కో విలూరుతిరుమలమున్మడికుమార మెంబెరుమానారు జయ్యరుస్వామి లిఖిత శ్రీకారకర్త్వతాన్వాధికార శ్రీముఖాకలిత మేల్నాటిగోష్ఠీవర్య లక్ష్మయామాత్యుండా రాజిల్లెను.

చ॥ భువిఁగలలక్ష్మయార్యువర భోగసమృద్ధినివిన్న యంతఁద
ద్దివిజవిభుండుచెంతకరుదెంచి హటాహటిసంభ్రమించి రే
బవలునుఱెప్ప మోడ్పకనె పల్మఱుఁగన్న కతంబునన్నచీ
ధవుఁడనిమేషసంజ్ఞఁదగఁ దాల్చెనుబాయకనాఁటనుండియుఁ గ॥

మ॥ వరలావణ్యసుకీర్తులంజెలగు మద్వంశేంద్రుఁడౌలక్ష్మయా
ర్యురమాసోదరులంబితామహుఁడు దానూహించిచూడంగనే
ర్పరుపన్నామికిబుద్ధికౌశలమునం బద్మారియందిడ్డభా
స్వరచిహ్నంబదికందటంచు నెలమింజర్చింపనింకేటికిఁ॥

క॥ అల్లక్ష్మయార్యుఁడంతట
నల్లమురంజిల్లపత్ని యుదరమునందు
న్నల్లలితవేంకయార్యుం
డల్లనఁబెద్దయ్యయనెడి యబలులగనిరోఁ॥

వ॥ తత్సుకుమార కుమారద్వితయంబునందు.

శా॥ శ్రీరమ్యంబగుకాంచికాపురి కడంజెన్నొందుమేల్పాటిలో
ధీరుండై నెలకొన్న పెద్దయభువిన్దీపించి తానాళువం
దారుస్తోత్రముసాంధ్రభక్తిని లసత్పద్యప్రబంధంబునా
లారాణించఁగఁజెప్పెనా చెలువపిళ్లస్వామి పేరందగఁ॥

వ॥ పెద్దయార్యునిపుత్రుండు చెన్నయార్యుండు తదనంతరంబ.

తే॥గీ॥ రహిని వేంకయ్య కులవధూరత్న గర్భ
మందుఁజెన్నారు తిరువెంగళార్యఘనుఁడు
వరుసలోకయ్య నాఁజెలువయ్యయనెడి
పుత్రులుజనించిరత్రి సత్పుత్రులనఁగ॥

వ॥ చెలువయార్యునిసూనుండు కనకయార్యుండు, తత్కుమా
రుండు నరసింహయ్య అందగ్రజుండు॥

తే॥గీ॥ హరిసిరినిమున్ను పరిణయంబైనకరణి
రంగనాంబానఘూటినిరంగమాఁబ



సరసతిరువేంగళార్యుండు స  మాన
వసుధవిబుధాళిపొగడ సు  ప్రహమహార్యా॥

సీ॥ తల్లికిఁదల్లియై యుల్లసిల్లనిల
గట్టుయందొగిఁ బుట్టి
భంగాస్వితుంజేరి ప్రబలనిజాహ్నవి
గోత్రారిచేఁబొందు గోరనిశచి
కువలయ ద్వేషినిగూడని సుచ్ఛాయ
కలహాశనునిఁగాంచకలరువాణి
తమ్ములపగవాని నమ్మనిరోహిణి
నరకునింబడయకఁబరఁగుధరణి

తే॥గీ॥ యీమెయానని బుధజనులెల్లమిగుల
వినుతిసల్పవిలసిల్లెవిమలమతిని
వఱలుతిరువేంగళార్యుని పత్నియైన
రంగదతులగుణాలంబ రంగమాంబ॥

వ॥ తదనంతరంబ.

క॥ తిరువేంగళార్యసతియై
యిరువొందెడిరంగమాంబ కిలబుత్రకులై
వరయోబళార్యుఁడనసు-
స్థిరమతి వేంకయ్యనాఁగఁ జెలఁగిరిరువురుశ॥

తే॥గీ॥ మహినిముచిసూదనుఁడుపులోమజనుబరిణ
యంబయినమాడ్కి శఠకోపమాంబనెలమి
గోరిపెండ్లిలితాఁజేసికొనిచెలంగె
వేంకయార్యభిజ్ఞామలవిబుధహేళి॥

వ॥ తజ్జాయాశిరోమణి.

సీ॥ తనుహీనునకుఁబ్రియ జననిగాకుండెనా
సిరినొకమాటుద్దిపరుపవచ్చు

వెనుముందుఁజూచువానిని సేలకుండెనా
సతినొకసారీడు సల్పవచ్చు
రహిఁబోరుదిండిని రక్షించకుండెనా
భాషనుసమముఁగాఁ బల్కవచ్చు
మందునిగా రాము మాతగాకుండెనా
ఛాయనన్నుపసరి సేయవచ్చు
తే॥గీ॥ నిట్టికొదవలుగలవార లియ్యవతికి
సాటియాదురె యనిబుధు లన్నుతింప
నలరెన వేంకయార్యు నర్ధాంగలక్ష్మి
కుశలశరకోపమాంబ సద్గుణకదంబ॥
వ॥ తదనంతరంబ:
పం॥ తే॥గీ॥ పఙ్క్తిరథునకుఁపట్టంపుభార్యయైన
కోసలాత్మజకునుమున్ను కొమరుమిగిలి
రాముఁడుదయించి నట్టులరమణ వేంక
యార్యసతి యగుశరకోప మాంబగర్భ
జలధిశశియన రామార్యుఁడలరెఁబోడమి॥
సీ॥ రమణీయసీతాత్మ రాజీవకలితుండు
హరిసన్నయభరతాన్వితుండు
ఖరదూషణారాతి వర సుమిత్రానంద
నేష్టుండుశత్రుఘ్న హితకరుండు
జనకహర్షప్రదుండినజాత సఖ్యుండు
కుశలవసుసమృద్ధివశపరుండు
మహివిభీషణచిత్త మహదార్తిహారణుండు
హంసాన్వయాబ్ధి నీహారకరుఁడు
తే॥గీ॥ రాముఁడలరారెఁదద్రీతినామసార్థ
కంబునగునట్టు విద్యాకదంబయుతుఁడు
గుణగణాఢ్యుండు మేల్మాటికోవిదుండు
రామయార్యభిషఙ్మౌళిరహిఁదనర్చె

తే॥గీ॥ గౌసలేయుండు సాధ్వియా వాసుధేయి
నతిముదంబునను ద్వాహమైనభాతిఁ
గృష్ణమాంబను బెండ్లియై పృథ్వియందు
రామయార్యభిప జ్ఞౌమ్మళిరమణఁజెలఁగె॥

వ॥ తదర్ధాంగీ సాధ్వీలలామంబు.

సీ॥ వల్లభుండన్యుల వాకిటఁబడియుండ
వారింపఁజాలని పద్మఁజేరి
మగఁడుపెక్షంబెత్త మర్యాదగాదంచుఁబల్కని
మలకూర్మిపట్టఁదెగడి
ప్రియుఁడుగోత్రంబె నుద్భేదింపఁగాఁగని
సైచుచుండిన శచీసతిహసించి
యినుఁడెప్డుకువలయంబున కార్తిగల్పించ
సంతసంబందెడి ఛాయనవ్వి

తే॥గీ॥ న్యూనమించుక లేక సదానయమునఁ
దనరిపేరిమిఁగల నిజధవుని సేవ
లెడతెగనిభక్తిచేఁ చేయఁదొడఁగి వెలసెఁ
బరమగుణపేటి కృష్ణమాంబావధూటి

వ॥ తదనంతరంబ

పం॥ తే॥గీ॥ దశరథునిభార్యయా సుమిత్రాతరుణికి
లక్ష్మణుండుద్భవించిన లాగురామ
యార్యకులసతీ కృష్ణమాంబాతిజఠర
శుక్తిముక్తాఫలంబన శుభముహూర్త
మునఁబొడమి లక్ష్మయార్యుండు దనరెభువిని॥

సీ॥ ఇంద్రజిత్పరవైభవైధితధీరుండ
హీనానతారుఁడనూనరామ
చంద్రానుజన్ముండు శాస్త్రప్రవీణుండు
జనకచిత్తాంభోజ శర్మకరుఁడు
దలపోయగాసుమిత్రా నందనుండూర్మి

రాభాసమానుండు లక్ష్మణాఖ్యుండు
భూరిభాస్వత్కులాంబుధి కైరవసఖుండు
సన్నయభరతాను సరణపరుఁడు
తే॥గీ॥ భూజనాహ్లాదకారుఁడై పొగడుఘనుఁడు
నామమాత్రంబున నెకాదు నవ్యసార్థ
భావమునను శత్రుఘ్నా గ్రగభవనిభుండు
లక్ష్మయార్యభిషజ్మౌళిలలిఁదనర్చు॥
సీ॥ పరఁగబిషక్శాస్త్ర పారంగతుండై ల
సద్ద్రావిడామ్నాయ సరణిఁగాంచి
శ్రీకోసలాన్వయా గ్రేసరుండైనసీ
తారామపార్థివోత్తముని చేత
హైరణ్యకటకరత్నాంచిత హారజాం
బూనదాంబరహయ భూములెలమి
సంపాదనమొనర్చి సరసులెన్న ద్వితీయ
ధన్వంతరియటంచు ధరణియంద
తే॥గీ॥ నూనతరసార విద్యావితానయుతుఁడు
కుందమాందార చందనాబ్దేందుయశుఁడు
గుణగణాఢ్యుండు మేల్నాటికోవిదుండు
లక్ష్మయార్యబుధేంద్రుండు లలిఁదనర్చె
తే॥గీ॥ లక్ష్మణుఁడు పేర్మిచే నూర్మిళను వివాహ
మైనమాడ్కి సతీరత్నమన నెసంగు
తిరుమలాంబమబెండ్లియై ధరణియందు
లక్ష్మయార్యభిషజ్మౌళిలలిఁజెలంగె॥
వ॥ తత్కుటుంబినీ సతీవ్రతంసంబు
సీ॥ ఇనునిచేసత్సం తతినిమాయనట్టునే
యించనిరోహిణియా మెయౌను
పెనిమిటిచేఁబుణ్య జనులకుబాధనే
యించని మైథిలియా మెయౌను

పథికరింభోళికిఁ బతిచేతహింసఁజే
యించనిస్సద్రతియీయామెయాను
చర్చింపరమణుని సగమెునర్చనియట్టి
హిమశిలోచ్చయ పుత్రియీయామెసత్య
తే॥గీ॥ మనుచుఁదద్దయువిబుధాళి వినుతిసల్ప
సంతతంబొప్పు వరభిషక్శాస్త్రనిపుణ
లక్ష్మయార్యునికుల వధూలక్ష్మిలలిత
దివ్యతరకీర్తినికురుంబ తిరుమలాంబ॥
వ॥ తత్పురంధ్రీ సాధ్వీమతల్లి.
కం॥ ఆమిథునమునకుఁగల్గెను
క్షేమమునవేంకయార్య శేఖరుఁడిలను
త్రామునకుఁ బులోమజకును
నేమమునజయంతుఁడొగి జనించినపగిదిన్॥
తే॥గీ॥ అరయమేల్నాటి లక్ష్మయార్యాభిధాన
భామినీమణితిరుమ లాంబాసుగర్భ
కలశవారాశికిని సుధాకరుఁడనంగ
రంగయార్యుండు వొడమిచెలంగెభువిని॥
తే॥గీ॥ అంతనాదంపతుల గర్భమందుఁజెలఁగి
మదనరూపసమానుఁడై మహిజనించె
గోపయార్యాఖ్యుఁడగు కులదీపకుండు
పిదపఁగృష్ణాఖ్య సత్పుత్రుఁడుదయమయ్యె.
వ॥ తత్కుమారరూప జిన్మారచతుష్టయంబునందు
సీ॥ సౌందర్యమునరమా నందనుండనవచ్చుఁ
దనుహీనుఁడైసదా దనరకున్న
వరవిద్యలందుఁదద్గురుఁడీతఁడనవచ్చు
ఘనమాధ్యసహితుఁడై పొనరకున్న
వైభవంబునదివస్పతి యీతఁడనవచ్చుఁ
గలిమిమున్నిటను గలియకున్న

నురుయశంబున హిమకరుఁ డీతఁడనవచ్చుఁ
దండికిభంగంబుఁ దలఁచకున్నఁ
తే॥గీ॥ గానవోరులనుబోల్ప జగానఁగాన
మింకఁదనకునుదాసాటి యీతఁడనుచు
సరసులెన్నఁగనాహ్లాద జలధినీదె
రంగయార్యాఖ్యసత్కవి పుంగవుండు॥
సీ॥ రమణకేదిగ్గేరి రాజధానీశ్వరుం
డై ప్రజ్వరిలుజంపు లాన్వయాబ్ధి
రాకేందుఁడౌ రంగ రాజకంఠీరవ
సచివాగ్రగణ్యుఁడై సంస్కృతాంధ్ర
కర్ణాటకప్రచిత్ర కవితావిశారదుండనఁ
బొల్చియతనిచే నొనరునట్టి
సౌవర్ణకటక సచ్చంద్రహారాష్ట
పదాంబరహయములనంది పిదప
తే॥గీ॥ భూరిశ్రీహసనాబాదపురవరాధి
కారియైమించు ధీరుకృష్ణశౌరి పేరఁ
గృతిఘటించి రహిన్బహుమతులనొంది
రంగకవిసార్వభౌముఁడై సంగెనవని
తే॥గీ॥ అతిముదంబున మదనుండు రతినిఁబరిణ
యంబయినచాడ్పునను సాధ్వియనఁబొనంగు
శేషమాంబనుబెండ్లియై క్షేమమొంది
రంగయార్యకవీంద్రుండు రహిఁజెలంగె॥
వ॥ తత్పురంధ్రీ సాధ్వీమతల్లి
పం॥చ॥ వసుమతియైవరుండెలమి వారకకందఫలాదులందఁగ
న్మెసఁగనయుక్తమంచనెనె నేర్పునరుక్మిణియైధవుండుమా
నసమున నెగ్గులేక నరనామముఁగల్గిన వానితేరుసం
తసమునఁదోలన్యూనమని తా వచియించెనె సద్గుణాళిచేఁ
బొసఁగెడి శేషమాంబనిలఁబోలఁగలారెటుభూమి భైష్మినుల్॥

తే॥గీ॥ అంతటన్రంగకవి శేషమాంబయందుఁ
గనియె వేంకటరమణార్య ఘనునిఁబిదప
లక్ష్మణస్వామియను నన్నులాలనమునఁ
బ్రేమమీఱఁ సీతారామ నామసుతుని॥

వ॥ తత్పుత్రత్రితయంబునందు.

సీ॥ ఆంధ్రగీర్వాణ కర్ణాటతురుష్క మ
హారాష్ట్రవిద్యల నభ్యసించి
జిష్ణుసంతానవర్ధిష్ణు విబుధకవి
గురుసమాశ్లేషమై పరఁగునట్టి
సురపురంబును బోలె సురపురీసంస్థాన
కోసలాన్వయవార్ధి కుముదమిత్ర
బుధజనమానస సాంభోజనన్మిత్ర
సీతారామభూమి భర్తృవరునిపొంత

తే॥గీ॥ నరయసచివాగ్రగణ్యుఁడై సరసమతిని
నతనిచేమన్ననలనంది యనుదినంబు
నిండు వేడ్కన్సు సుంధరామండలమున
రమణఁదనరారె వేంకటరమణసూరి॥

మ॥ గరిమం దాబుధవత్సలుండు సుకళాకాంతుండు గోత్రోదయుం
డరయన్సత్పథచారుఁడుత్కలవల యాహ్లాదుండు జైవాత్రృకుం
డురు సౌందర్యమునంది నేఁర్పుఁడిలలో నొప్పారు సర్వజ్ఞశే
ఖరుఁడౌ గావున వేంకటార్యకవి రాకాచంద్రుఁడౌ దద్యమున్॥

మ॥ మదనుండేయనఁజెల్లు వేంకయసుధీమాళిం జొకాటంపుఁజ
క్కఁదనం బందతనుండు పుణ్యజనసంఘుచ్ఛేది సంభూతుఁడు
న్మద చండాళిసమావృతుండు మదినెన్నన్జాతి రాహిత్యుసా
హృదుఁడుగ్వీస్థలి పాంథహింసకుఁడు దానిం పారఁగా కున్నచోన్॥

వ॥ తదనంతరంబున నాత్మపత్నియగు రంగమాంబయందు వరదరాజులు, వేంకటస్వామి, దేవరాజులను పుత్రత్రయంబునుంబడసి ప్రధాన మహోపాధ్యాయుండనంబొల్చి వేంకయార్యుండు కీ

రి శేషుండయ్యెను. సీతారామాభిధుండు నిజభార్యయైన సీతమ్మయం దురంగనాయకులను సుతునింగాంచి పాఠశాలాశాఖాధ్యక్షులచే శ్రీ ములను నామధేయంబువహించి స్కూలను పరీక్షయందుఁగడ మును ప్రధానోపాధ్యాయుండై ప్రవర్తించి యిప్పుడు సహాయోపా ధ్యాయుండై బాలురకు విద్యఁగఱపుచు సంతసిలుచున్న వాఁడు.

తే॥గీ॥ గోపయార్యభిషఙ్మౌళి కులవధూటి
యైనదామోదమందెడి యచ్చమాంబ
కవని నవమన్మథాకారుఁడైజనించి
చెలువయార్యుండు చర్చింప నెలమిఁజెలఁగె॥

వ॥ చెలువయార్యుండు మున్ప్రధానోపాధ్యాయత్వముఁగావిం చి కతిపయదివసంబులకుఁ జాలించుకొని సురపురమునందుఁ గృష్ణభూ వరునిచెంత కార్యనిర్వాహకుండైతనర్చి సహధర్మిణియైన గోపమాం బయందు జెలువపిళ్లస్వామియను కుమారునింగని విరాజల్లుచుండును.

తే॥గీ॥ కృష్ణయార్యాభిధుని ధర్మగృహిణియైన
కమలమాంబకునవని సక్రమముతోడ
జననమందిరినవ ధనంజయసమాఖ్యుఁ
డాదిశేషుండుమతి నిశ్శేషాభిధుండు॥

వ॥ జ్యేష్ఠుడైనధనంజయాభిధేయుండు స్కూలనుపరీక్షయందు గడ తేఱి సహాయోపాధ్యాయుండై బాలురకు విద్యాభ్యాసంబుఁగావించు చుగృహిణియైనవేంకమయందుఁగృష్ణయ, వేంకయ,యనుసూనులంగ నితనరుచుండును. తదనుజన్ముండైనశేషయాఖ్యుండుస్కూలనుపరీక్షం దుఁగడతేఱి సహాయోపాధ్యాయుండై బాలురకువిద్యనుబోధించుచు భిషక్శాస్త్రమునందుఁగొంతనేర్పరియై అంతర్వత్నియైన చెల్లమ్మయను జాయతో మెలంగితనరారుచుండును.

తే॥గీ॥ అట్టివేంకటరమణార్యు ననుఁగుఁదమ్ముఁ
డైనయేనర్థిగోపాలు ననవరతముఁ
బరఁగఁబూజించి తత్కృప వడసికృతియొ
నర్చుటకుమదిఁ దలచియున్నాఁడభువిని॥

- చెన్నయార్య
  - పు. మురార్యార్య
    - పు. వేంకయార్య
    - పు. గోవిందయార్య
      - పు. కొండయార్య
        - పు. ఆళ్వారయార్య
        - పు. అంబులార్య
        - పు. లక్ష్మయార్య
          - పు. వేంకయార్య
          - పు. సిద్ధయార్య

రి శేషుండయ్యెను. సీతారామాభిధుండు నిజభార్యయైన సీతమయం దురంగనాయకులను సుతునింగాంచి పాఠశాలాశాఖాధ్యక్షులచే శ్రీరా ములను నామధేయంబువహించి స్కూలను పరీక్షయందుఁగడతేరి మును ప్రధానోపాధ్యాయుండై ప్రవర్తించి యిప్పుడు సహాయోపా ధ్యాయుండై బాలురకు విద్యఁగఱపుచు సంతసిలుచున్న వాఁడు.

తే॥గీ॥ గోపయార్యభిషజ్మౌళి కులవధూటి
యైనదామోదమందెడి యచ్చమాంబ
కవని నవమన్మథాకారుఁడై జనించి
చెలువయార్యుండు చర్చింప నెలమిఁజెలఁగె॥

వ॥ చెలువయార్యుండు మును ప్రధానోపాధ్యాయత్వముఁగావిం చి కతిపయదివసంబులకుఁ జాలించుకొని సురపురమునందుఁ గృష్ణభూ వరుని చెంత కార్యనిర్వాహకుండై తనర్చి సహధర్మిణియైన గోపమాం బయందు జెలువపిల్లస్వామియను కుమారునింగని విరాజిల్లుచుండును.

తే॥గీ॥ కృష్ణయార్యాభిధుని ధర్మగృహిణియైన
కమలమాంబకునవని సక్రమముతోడ
జననమందిరి నవ ధనంజయసమాఖ్యుఁ
డాదిశేషుండుమతి నిశ్శేషాభిధుండు॥

వ॥ జ్యేష్ఠుడైన ధనంజయాభిధేయుండు స్కూలనుపరీక్షయందుగడ తేఱి సహాయోపాధ్యాయుండై బాలురకు విద్యాభ్యాసంబుఁగావించు చుగృహిణియైన వేంకమయందుఁగృష్ణయ, వేంకయ్య,యనుసూనులంగ నితనరుచుండును. తదనుజన్ముండైన శేషయాఖ్యుండు స్కూలనుపరీక్షం దుఁగడతేఱి సహాయోపాధ్యాయుండై బాలురకువిద్యనుబోధించుచు భిషక్శాస్త్రమునందుఁగొంత నేర్పరియై అంతర్వత్నియైన చెల్లమయం దుజాయతో మెలంగి తనరారుచుండును.

తే॥గీ॥ అట్టి వేంకటరమణార్యు ననుఁగుఁదమ్ముఁ
డైనయేనర్థిగోపాలు ననవరతముఁ
బరఁగఁబూజించి తత్కృప వడసికృతియొ
నర్చుటకుమదిఁ దలచియున్నాఁడ భువిని॥

- చెన్నయార్య
  - పు. మురార్యార్య
    - పు. వేంకయార్య
    - పు. గోవిందయార్య
      - పు. కొండయార్య
        - పు. ఆళ్వారయార్య
        - పు. అంబులార్య
          - పు. వేంకయార్య
        - పు. లక్ష్మయార్య
          - పు. పెద్దయార్య

పు. పెద్దయార్య
|
పు. చెన్నయార్య
|
భా. కృష్ణమాంబ

పు. వేంకయార్య
|
పు. చెలువయార్య
|
పు. కనకయార్య
|
భా. తిరుమలాంబ
|
పు. నరసింహయ్య

పు. లోకయార్య

పు. వేంకయార్య
|
భా. శఠకోపమాంబ
|
పు. రామయార్య
|
భా. కృష్ణమాంబ
|
పు. లక్ష్మయార్య
|
భా. తిరుమలాంబ

పు. తిరువేంగళార్య
|
భా. రంగమాంబ
|
పు. ఓబళార్య

భా. తిరుమలాంబ

పు. వేంకయార్య — భా. తిరువేంగళాంబ
- పు. వరదరాజులు — భా. అనంతమ

పు. రంగయార్య — భా. శేషమాంబ
- పు. వేంకయార్య — భా. రంగమాంబ
  - పు. వేంకటస్వామి — భా. రామమ
    - పు. వెంకయ
- పు. లక్ష్మయాభిధేయ — భా. ముగ్గురు
  - పు. దేవరాజులు
- పు. శీతారాములు (శ్రీరాములు) — భా. సీతమ
  - పు. రంగనాయకులు

పు. గోపయార్య — భా. అచ్చమాంబ
- పు. చేలువయార్య — భా. గోపమాంబ
  - పు. చెలువపిళ్లస్వామి

పు. కృష్ణయార్య — భా. కమలమాంబ
- పు. ధనంజయ — భా. వెంకమ
  - పు. కృష్ణయ
- పు; శేషాఖ్య — భా. చెల్లమ్మ
  - పు. వేంకయ

# కావ్యాధిక్యము



చ॥ అరయఁగనిద్ధరిత్రిఁ దనరారెడిపుణ్యములందు యోగ్యమై
పరఁగునుబుణ్యకావ్యమది పల్కులునేరికినబ్బెనేనిన
ప్పురుషశిఖావతంసుఁడొగి బొల్పగుసారసభన్వసించుచు
స్థిరసుఖవార్ధిఁదేలుచును దివ్యయుగంబులునిశ్చయంబుగన్॥

తే॥గీ॥ అగ్రహారంబు వనముగావ్యంబు దేవ
ళంబునిక్షేపమును దటాకంబుఁగొమరుఁ
డనెడియిచ్చకుప్పగడ యుఁధనరుచుండు
సారిదిఁగనసప్తసంతాన గరిమలనఁగ॥

వ॥ తే॥గీ॥ భవములెన్నియుసల్పిన చివరసప్త
సంతతులయందొకటి సారవంతముగనొ
నర్చునాతఁడు తనదువర్ణ్ణములవారి
నిరయములఁద్రోచి కైవల్యసరణిఁజూపుఁ
గానసత్కృతికెననేజగానఁగాన॥

తే॥గీ॥ పిటివెల్లువఁగలజలం బేటఁగూడి
నిర్మలంబైనకరణి దుర్నీతివంతుఁ
డైనఁదానొకతఱిఁ బ్రబంధాంతరమున
విశదముగఁబల్కఁబడినఁ బవిత్రుడగును॥

తే॥గీ॥ ఏఘనునినామధేయంబు నిలఁబ్రబంధ
మునవిడక రాజిలుచు నెన్నిదినములుండు
నంతపర్యంతముండుఁ దానమరపురినిఁ
దనరునుపమ నింద్రద్యుమ్నునికిఁగనగ॥

తే॥గీ॥ ఈప్సితంబులనొడఁగూర్చు నిలనుగిల్బి
షములఁబోకార్చుఁదనకు ధనముయశంబు
శుభములనొసఁగుఁబాయక సులభగతిది
వౌకసులఁగనఁజేయు గావ్యముసుకవికి॥

వ॥ తే॥గీ॥ పుడమిబ్రహ్మర్షియయ్యెఁదాఁ బుట్టుమాలి
వరమయూరుండువడిగ భాస్కరునిఁజూచె
భట్టహర్ష కవీంద్రుండుఁబాసెశ్వేత
కుష్ఠురోగంబుగావున శ్రేష్ఠకృతిము
ఖమునఁబడయువి పదనెలుఁగలవెయొందు॥

చ॥ ఇదిమదినెంచియేఁగృతి రచింవఁదొడంగినవాఁడఁ బొల్పునం
ద్రిదశవితానవంద్యుఁడ కిరీటికిబాసలయైనభాతినే
కొదవలుఁజెందనీకఁగడుఁ గూర్మిదలిర్పఁగఁదోడుఁగల్గికో
విదతతిమెచ్చుమాడ్కి నేఁజవేర్చెడిభారమునీదు సుమ్మిలన్॥



# షష్ఠ్యంతములు



క॥ శీలునకతులితనయపరి
శీలునకఘభేదికిని సుశీలునకునుగో
పాలునకుదివ్యకాంచన
చేలునకుఖగాంకునకుఁ గుచేలసఖునకున్॥

క॥ ధీరునకువితతజగదు
ద్ధారునకరిదైత్యచయవి దారునకసితా
కారునకాశ్రితముని మం
దారునకువిదర్భరాజతనయేశునకున్॥

క॥ కుందాభరదనునకునర
విందాసనవిబుధ విసర వినుతునకుసదా
మందానిలాశితల్పున
కిందీవరనయనునకుసుమేశహితునకున్।

క॥ రంగద్గజేంద్రవరదున
కంగజజనకునకు శూరహాలిసహజునకు
న్గంగద్గారుడమణిఖచి
తాంగదునకుయాదవాన్వ యగ్రామణికిన్॥

క॥ వాసవమదభంజనునకు
వాసితమృగమదవిలేపవక్షునకుఁగళిం

దాసుందతీహృన్నళినో
ల్లాసమిళింద్రునకునధికలావణ్యునకున్॥

క॥ తాండవఖేలునకున్దుర్విహి
ణాండోదరునకును రవిశశాంకాక్షునకు
న్బండనకంసధ్వంసికిఁ
బాండవపక్షునకుసత్య భామాపతికిన్॥

క॥ సాధుజనరక్షణునక
క్రోధనునకు వేణు వాద్యకోవిదునకువి
శ్వాధారునకంచితభ
ద్రాధవునకు ధవలతాసితలవిత్రునకున్॥

క॥ హారికివరవైకుంఠవి
హారికిమధుకైటభాసు రాద్యరిగణసం
హారికినిర్జరభయపరి
హారికిదుష్టవిభవాపహారికి హరికిన్॥

వ॥ సమర్పితంబుగా నాయొనర్పంబూనిన పండితపామర జన
రంజనంబైన కవికర్ణామృతం బెట్టిదనిన.



శ్రీవేణుగోపాలాయనమః

కవికర్ణామృతయు

# భక్తసులభ మహిమానువర్ణన
# పద్యరత్నావళి



క॥ శ్రీరామేనగభీర
క్షీరాబ్ధిశయానదీన సేవాధీనా
మారాకారనిధానా
సారగుణవితానపాహి సత్ఖగయానా॥

తే॥గీ॥ దేవదేవేశనీమాయఁ దెలియుటకును
మునుకొనివిధాతగోత్ర భిన్ముఖ్యసురలు
శక్తులెంతకుఁగారన జగమునందు
నితరులనుజెప్పనేటికిఁ బ్రతిభమెఱయ॥

క॥ నీకృపగల్గినవారికి
లోకమునందేభయంబు లోఁగొనదుహరీ
చేకొనిజ్ఞానోదయమెప్పు
డాకరమైమానసమున నలరుటనేనన్॥

క॥ అంతేటనీవేగలవనిఁ
జింతించెడిసాధుజనుల చిత్తమునందే
కాంతుఁడవై నెలకొనినయ
నంతుఁడనినునేస్మరింతు నశ్రాంతంబున్॥

తే॥గీ॥ ఇన్నిదినములు నీసత్యమెఱుఁగలేక
వ్యర్థముగఁగాలమువని పైవ్యయమొనర్చి

మందభాగ్యుఁడనైతి రమాకళత్ర
దీనమందారవినమిత మానివార॥

క॥ నీదాసుల సాంగత్యము
ప్రాదుర్భావంబునొందఁ బాపములణచు
న్వేదాంత వేద్య హరిప్ర
హ్లాదవరద పావనాత్యలక్ష్మీనాథా॥

క॥ దానవమద గజనవపం
చాననసదయాత్మ మనుజహర్యక్షహరీ
దీనజన కల్పకద్రుమ
భానుశశాంకాభ నేత్రభవసన్మిత్రా॥

క॥ తెలియకఁజేసిన పాపము
దెలిసిక్షమాపణము గోరదే వేశహరీ
దొలఁగించెదవని ప్రాజ్ఞులు
పలుకుదురంతటను దేటపడఁగధరిత్రిన్॥

క॥ కేశవనామ స్మరణము
క్లేశములనుదొలఁగఁజేయుఁ గేవలముగ స
ర్వేశునియందజభవులు ప్ర
వేశించిపసించుకతన విడువకఁబుడమిన్॥

క॥ భక్తజన సముదయమునకు
ముక్తిప్రదుఁడైన రామమూర్తినిఁగడఁక
శ్శక్తికొలంది స్మరించిన
వ్యక్తికిఁజేకుఱని పదవివసుధంగలదే॥

క॥ అనిశముహరినిస్మరించని
మనుజునివక్త్రింబుపాడు మడువననొప్పు
న్దనుజారికథలు విననిశ్ర
వణములుతరుకోటరముల వడువనఁజెల్లున్॥

క॥ హరిభక్తి గల్గెనేనియు
నరునకు వేఱొండ దేల నరకాస్పదమౌ
దరిఁ జేర్పునావయుండఁగఁ
బరువిడ నేమిటికి వార్ధిఁ బ్రాపించునకున్॥

తే॥గీ॥ తలఁప దారాత్మజులయందుఁ దవిలిమనము
హరికిదూరగుఁడైనట్టి నరునిజన్మ
మవనివ్యర్థంబుగావున ననవరతము
భక్తిశ్రద్ధచేఁ బాటుపడుట మేలు॥

ఆ॥వె॥ నీదుభక్తవరుల నిర్మలపదధూళి
నాదునుదుటియందు నయముగాను
దివ్యతరమృగమదతిలక రూపంబయి
తనరుఁగాక భవదుదారమహిమ॥

క॥ నీకంటె వేఱుదైవము
నాకెవ్వరులేరులేరు నాపాపములం
బోకార్చిప్రోవవే విధి
నాకాధిపముఖ్యసుర వినమితపదాబ్జా॥

ఆ॥వె॥ మాంద్యబుద్ధివలన మాధవనినుఁగొల్వ
నైతిఁగాన జన్మ మవనివ్యర్థ
మయ్యెనింక నెట్టు లాదరించెదొ భక్త
వత్సలుఁడను బిరుదుపాయకుండ॥

క॥ ఏనరుఁడుగాని భవదభి
ధానంబొకతూరివల్కి ధన్యుండౌదాఁ
బూనకనిన్ను స్మరించెడి
వానిసుకృతమునకు మేర వసుధం గలదే॥

తే॥గీ॥ మోహమేఘమునకునైన మోసపుచ్చుఁ
బంకరుహజాతునట్టిలోఁ బరచుకొనిమె

ననఁగనితరుల దేపాటి హరికృపావ
లోకనముగల్గకున్నను జోకయగునె॥

ఆ॥వె॥ భక్తిచేతనైన వైరత్వముననైన
మనసులేకయైన మరణకాల
మునను భ్రాంతిచేత వనజనాభునినామ
ముచ్చరింప ముక్తినొందునరుఁడు॥

క॥ దీనికజామిళుఁడనుధా
త్రీనిర్జరుఁడరసిచూడ దృష్టాంతంబౌ
సూనునినారాయణయని
ప్రాణాంతమునందుఁ బల్కఁబరముంజెందన్॥

ఆ॥వె॥ ఇట్టిసులభుఁడైన యిందిరేశునినొక్క
నిమిషమాత్రమైన నిశ్చలాత్ముఁ
డైస్మరించనట్టి యజ్ఞానమనుజుఁడె
ప్పట్లఁగనద్విపాద పశువుగాడె॥

ఆ॥వె॥ భక్తసులభునెపుడు భజియించువారల
పుణ్యమింతయనుచుఁ బొగడుటకును
జలజభవునకైనఁ జిలువతేనికైనన
నలధిషణుకకైన నలవియగునె॥

ఆ॥వె॥ జంతుజాలముననుజ్ఞానవంతులనగా
మానవులనొనర్చె మాధవుండు
తనదుమహిమనెఱిఁగి ధన్యత్వమునుజెంద
దీనినరయరవని హీనమతులు॥

తే॥గీ॥ మతములందునిమగ్నులై మత్సరమున
నిన్నుదూషింతురెపుడు దుర్నీతిపరులు
వారలకుముక్తిగలదె యోవాసుదేవ
యెన్నిభవములనరులైననేమిఫలము॥

తే॥గీ॥ శైవులెందరో హరినామ సంస్తవంబు
సల్పశంకింతు రేశాస్త్ర సమ్మతంబొ
వైష్ణవులుగొంద ఱీమ్మాడ్కి భవుని నామ
ముచ్చరింప రెటువంటి మచ్చరంబొ॥

తే॥గీ॥ తామసపురాణములుగొన్ని తాపసాళి
వలనఁగల్పింపఁబడెఁ బరాత్పరుననుమతి
సుజనకంటకులైన యసురులకొఱకు
నిదియెనిజమనిమూఢులు మదిఁదలంతు॥

ఆ॥వె॥ పఠనయోగ్యమైన భక్తసులభమహి
మానువర్ణన ప్రసూనరాజి
భాగవతులకొసఁగుఁ బరమపదంబును
వేఱనుడువనేల విస్తరించి॥

గద్యము.

ఇది శ్రీమత్సురపురీ సంస్థానస్థిత శ్రీవేణుగోపాలస్వాముల చరణాంభోజమత్తద్విరేఫాయమాన, చాత్తాద శ్రీవైష్ణవద్విజ షోడశకర్మాధికార శఠకోపర్షిపవిత్రగోత్ర, త్రిమతస్థాపనాచార్య మహాభాష్యకార యతిసత్పుత్ర, తిరుక్కోవిలూరు మఠాధికార, బ్రహ్మశ్రీ శ్రీనివాస రాఘవాచార్య కృతపంచ సంస్కారయుత సమాశ్రయణ, రావిడామ్నాయ ప్రవర్తక. గీర్వాణాంధ్ర కర్ణాటక నాటకాలంకార కావ్యకృత, మేల్నాటి గోష్ఠివర్య రంగయార్య కవిపుంగవ ధర్మపత్నీ పతివ్రతా శిరోమణీ శేషమాంబా గర్భ పయఃపారావార రాకాసుధాకర రసికశేఖరుండును, బుధజన విధేయుండును, బాలోపాధ్యాయుండును. నగు లక్ష్మయాభిధేయ ప్రణీతంబైనభక్త సులభ మహిమానువర్ణనంబను కవికర్ణామృతంబు సంపూర్ణము.

---

# విషయసూచిక

శ్రీవేణు గోపాలాయనమః

# కవికర్ణామృతము



శ్రీమత్సురపురీ వేణుగోపాలాద్యంకిత గీర్వాణాంధ్ర కర్ణాటక

## సంకీర్తనమణి మంజరి

తోడి రాగము - రూపతాళము

పల్లవి॥ కరిరాజ-వరద మాంపాహి॥

అనుపల్లవి॥ సురసేవిత-వరపదపంకజభవహర॥

౧ గానలోల-దీనపాల - దానవజలధరసమీరణ - సూనశరాసనజనక
మానితపావనమౌని - మానససరసిజమధుకర॥ కరిరాజ॥

౨ మందరధర - ఇందిరావర, నందతనయనాగతల్పగో - విందసుజన
వినుతముచి కుందావనజగదీశపు-రందరతనుసంభవహిత॥ కరిరాజ॥

3 శౌరిమిత్ర -నీలగాత్ర. శ్రీలసురపురీనివేశగో - పాలమురాసురభం
జన - తాలధ్వజసోదరవన - మాలాధరమందహాస॥ కరిరాజ॥

కేదారగౌళరాగము - అటతాళము

పల్లవి॥ పాహిమాంనీలాబ్ద సమగాత్ర -పంకజనేత్ర ఆహవామర
వైరిచయజైత్ర - అతులితచరిత్ర॥ పాహిమాం॥

అనుపల్లవి॥ మోహకలుష లతాశితలవిత్ర - మఃరమథపుష్కర - నా
హినీజూటాగ్రధరమిత - వరమాకళత్ర॥ పాహిమాం॥

౧॥ తారహారపటీరఘనసార-పారదశతార. హీరపారదకీర్తివిస్తార
సారసజ్జనమానసవిహార - సామజోద్ధార - సీరపాణిసహోదర
సుపారా - వారగంభీర॥ పాహిమాం॥

౨॥ కుందకుట్మలసదృశనవదంత- కురుకులకృతాంత-మందరాచల ధృతిమహీకాంత-సుందరీరాధాకుచనిశాంతసులభసత్స్వాంత నందనందసమహితగుణశాంత వందితానంత॥ పాహిమాం॥
౩॥ గరుడవాహనరుక్మిణీలోల - కాంచనచేల - నిరతసేవితభక్తసు రసార - పరమశోభాకలితవనమాల - వసుదేవబాల - సురపు రీశ్రీవేణుగోపాల - కరుణాలవాల॥ పాహిమాం॥

మోహనరాగము — రూపకతాళము.

పల్లవి॥ మానాయకమాంపాలయ॥ మానాయక॥
అనుపల్లవి॥ దానవాహివైనతేయ॥ మానాయక॥
౧॥ దాసమానసాబ్జభృంగ - వాసుదేవవారిజోద్భవ - వాసవాది బుధవినుతస - త్యాసమేత - తాపసార్చిత॥ మానాయక॥
౨॥ వేణుగానలోలచక్ర - పాణికనకచేలకుసుమ - బాణజనక శ్యామలాంగ - బాణదైత్యబాహుఖండన॥ మానాయక॥
౩॥ పుండరీకవరదదేవ - పుండరీకనేత్రకౌస్తుభ - మండనసుర పురగోపాల - భండనామరారిభంజన॥ మానాయక॥

కల్యాణిరాగము ఆదితాళము.

పల్లవి॥ వనజనయనబాహిమాం - దనుజాన్వయవిధ్వంస॥ వనజ
అనుపల్లవి॥ ఘనయదువంశాం - బునిధిసుధాధామ॥ వనజ॥
౧॥ కమలామనోహర - కలుషౌఘపరిహార - విమలగో కులవిహార - సమరాసురసంహార॥ వనజ॥
౨॥ ఇందీవరనేత్ర - ఇందుశేఖరమిత్ర - సుందరనీలగాత్ర- వందనీయచారిత్ర॥ వనజ॥

కాంబోజిరాగము — రూపకతాళము

పల్లవి॥ వనజాక్షవరసురౌఘు-వినుతపాహిమాం॥ వనజాక్ష॥
అనుపల్లవి॥ ఘనతరయాదవకులకలశాం - బునిధితారేశ॥ వనజాక్ష॥
౧॥ ఇందిరామనోహర - నందగోకులవిహార - బృందారకభ యపరిహార - మందభాగ్యాపహార॥ వనజాక్ష॥

౨॥ శ్యామలాంబుదసుగాత్ర - కామజనకకంసజైత్ర - సోమ
జూటాగ్రధిరమిత్ర - సామజనుతచారిత్ర॥ వనజాక్ష॥
౩॥ పరమసఖీకృతకుచేల - కరుణార్ణవకనకచేల - నిరత
సేవితభక్తసురసాల - సురపురీవేణుగోపాల॥ వనజాక్ష॥

పూరవిరాగము - ఏకతాళము.

పల్లవి॥ పంకజాక్ష నేనీ - కింకరుడనుసుమీ-
శంక సేయక బ్రోవుమీ - శౌరిశ్రీ॥ పంకజాక్ష॥
అనుపల్లవి॥ పొంకముచేసుర - పురగోపాలఖ
గాంక వేణుధర - పంకవినాశన॥ పంకజాక్ష॥
౧॥ పలువిధములనే-బిలిచిన-బలుకవు-కలకాల-మిలలోదాసాళికి
సులభుడవనినుతి-సలుపుదురలు కేలయపరాధమేమినా-వలన
శ్రీలలనా-ధవసైచ-గలన-గలచిన-గొలిచిన-నీకడ - నిలచిన
(వలచిన
జలజనాభనీపొలుపగుబీరము - దొలగిపోవునో - బలిమద
భంజన॥ పంకజాక్ష॥
౨॥ ననుబోషించెద - నని నెరనమ్మితి - నెనరుంచవుదీనా - వన
(ఘునదను
జాంతక - వనజాసనవందితభక్తాధీన - యనుమానించుటమె
(త్తనమ-
మొరవినుమ - కనుగొనుమ - యనయము - వినయము-
(చేబూజించెద
దనియుము - మొనయుము - మునిజననతనామనమున
వేగమె - యినతనయాహతె - వనమాలాధర॥ పంకజాక్ష॥
౩॥ అరయగవరసుర - గరుడోరగకి - న్నరనరుల - మరువకబా
లించెడి-దొరవనినీదురుతరచరణాబ్జము ల - స్మరియించితెగా
చుట-కరుద-యిది-బిరుద-కరి-వరద - నరగున- నీ తెరగున-జే
రితినీ-మరుగున - యెరుగుచా- స్థిరమగుభక్తిని - మురహార
భవసా - గరమునుండినను - దరిజేర్చవెహారి॥ పంకజాక్ష॥

కాంబోజిరాగము రూపకతాళము.

పల్లవి॥ నమ్మినాడను -నెమ్మనంబుననిను శ్రీహరి॥ నమ్మి॥
అనుపల్లవి॥ ఇమ్మహిభక్తా-ఘుమ్ము నకువ-రమ్ము లోనగెదవని॥నమ్మి
౧॥ కరిమొరవిని-పరుగిడికని - కరముచేగడ - రరిగివెసమ-కరిని ద్రుంచియా-కరిని నేలిన శ్రీ - కరుడవనినిరతము॥ నమ్మి॥
౨॥ వేలుచు బాంచాలిని నునా- డోలగమున - జాలగబతి-మాలి నందున - నాలకించిదు - కూలములనిడితని॥ నమ్మి॥
౩॥ పన్నగసురపురమున నెల - కొన్న వేణుగోపాలుడి-మున్నునే సల్పి - యున్న నేరంబుల - మన్నించెదవనికడు॥ నమ్మి॥

బిలహరిరాగము రూపకతాళము.

పల్లవి॥ పంకజనయనపరాత్పర - పాపహరకావవె॥ పంకజ॥
అనుపల్లవి॥ పంకముచేభాసిలుసుర - పుర వేణుగోపాల॥ పంకజ॥
౧॥ కరిగాచినదొరవనినే - గరమరుదుగమదిని - నెరనమ్మితిని రతమునీ - వరమర సేయకను॥ పంకజ॥
౨॥ కోరమాలినకురుకుపలజుల-దురమునదెగటార్చి - వరకాంతే యులబ్రోచిన - వడువుననన్నికను॥ పంకజ॥
౩॥ విరసంబుననడిరాత్రిం - చరసంఘాతమును, - బంమార్చిసుర లగాచిన - తెరగునమానకను॥ పంకజ॥

కేదారగౌళరాగము - రూపకతాళము

పల్లవి॥ నిన్నెనెరనమ్మితి - నీరజాభనేత్రనిజముగమది॥ నిన్నె॥
అనుపల్లవి॥ ఎన్నదగిన - శ్రీలసురపురమ-ననెల - కొన్న వే ణు - గోపాలుడవనిమరువక॥ నిన్నె॥
౧॥ మారజనకమందమతినై - నేరకనేజేసియున్న - నేరములనీ వెన్నక - నిరుతమునను - గారవించి - కాచెదవని -కోరికచే॥
౨॥ సారములేనట్టి సం - సారమనెడిసాగరమున - దూరిదారిగా నకదడబడిదరి - జేరిచెదనియే - మారకనేమానసమున॥
౩॥ శ్రీపతినీపాదచింతన - సేయువారలనునరక - కూపమునను ద్రో యకకూరిమిచే - నాపదలెల్ల - బాపెదవనిపాయకనే॥ నిన్నె॥

యదుకులకాంభోజి - ఆదితాళము

పల్లవి॥ దామోదరదయయుంచవదేల - దళితేభదనుజసఖ॥దా॥
అనుపల్లవి॥ రామయదుకులాబ్ధి - సోమసేవకజన - కామధేనోర
మామనోనాయక॥ దామోదర॥
౧॥ భావంబుననినునెరనమ్మితిని - భక్తాభిమానివని - భావజ
జనకివి - భావసుశశిధృ - గ్దేవదేవవసు - దేవతనూభవ॥దా॥
౨॥ పంతమనెనరున ననుగావగను - పలుమారువేడెనను - దంతి
నుతవరా - నంతశయనదు - ర్దాంతకురుకులకృ - తాంత
పరాత్పర॥ దామోదర॥
౩॥ దాసునిపైనీకింతటిచలమ - ధరబ్రోచుటకబలమ - వాసవా
ర్చితపాద - వనరుహలోచన - భాసురసురపుర - వాస
గోపాలక॥దామోదర॥

ఆరభిరాగము - రూపకతాళము

పల్లవి॥ నీలాబ్దసన్నిభాంగ - నీరజేక్షణపారెయెన్నను॥ నీలాబ్ద॥
అనుపల్లవి॥ శ్రీలసురపురవరగో - పాలనిన్ననునంబిపె॥ నీలాబ్ద
౧॥ దావజ్వాలెగళుకివాసు - దేవనిన్నుప్రార్థిలా - పావకనను
భక్షిసిమిగె - గోవళరనుకాయ్దెతెరది॥ నీలాబ్ధ॥
౨॥ తరుళతనదిగెర్దియిర్ప - దురితవన్నుగణిసదలె - మొరెయన్నా
లిసిమాణదె - పరిపరివిధదింబేగనె॥ నీలాబ్ద॥
౩॥ సారరహితమాదనం - సారసాగరదోళ్మునిగి - దారియకా
ణదెబళలువె - తీరకెసేరిసికరుణది॥ నీలాబ్ద॥

వేంకటేశ్వరాంకితము

కేదారగౌళరాగము - ఆటతాళము.

పల్లవి॥ నీకుర్వేసములెవ్వరు - నీరజనేత్ర॥ నీకుర్వే॥
అనుపల్లవి॥ పాకవిధ్వంస్యాది సురనుత - పాపనాశనభక్తవత్సల
లోకరక్షకపాహిమాంశ్రీ-లోలసురపురివేంకటేశ్వర॥నీకు॥

౧॥ పరమపావనుడవీవు - నుతసుజనపాలన - కరిరాజవరద
ప్రోవు - కరుణచేతభవార్ధిజడులను - సరగనేలినసాత్వికుం
డవు - సురలకొరకుహిరణ్యకశిపుని - దురమునద్రుంచినన్నృ
కేసరి ॥నీకుర్వి॥
౨॥ మందరాద్రినిబైకెత్తి - జగములనుగాచితి - వొందుగమురళి
నొత్తి-నందముఖ్యులగూడుకొనిగో - బృందములనేలితివివర
గో-విందనినునెడతెగకగొల్చెద-నిందిరేశముకుంద కేశవ॥ నీ॥
౩॥ అంగనయౌపాంచాలి - వినుతించగోకలో-సంగితివినయశాలి
సంగరాసురమదవిభంజన -యింగితప్రదదీనబాంధవ-రంగగా
ధభుజంగతల్పక - తుంగవిహగకులేంద్రవాహన॥ నీకుర్వి॥

## శ్రీ రామాంకితము.

మోహనరాగము - ఆటతాళము.

పల్లవి॥ శ్యామలాంగుడౌశ్రీ - రామచంద్రునిగాంచి - నామ
నఃకుముదము - వికసించెను॥ శ్యామ॥
అనుపల్లవి॥ ప్రేమచేకౌసల్యా - భామామణికిబొడమి - యే
మారకసురపురి - నేలుచునుండిన॥ శ్యామ॥
౧॥ అనుజసమేతుడై - నెనరునగాధిసూ - నునివెంటదెరలుచు-
మోదముచే-బనిపూనితాటక- బరిమార్చిభాసిల్లు,వనముజూ
చి-యతిచేనెసంగుస-వనముగాచి - మునిజానిశాప - మును
ద్రోచి-జనపాలకుండౌ - జనకుపీటికి-జనిప్రమోదించి-వనజా
సనాదులు- వినుతిసల్పహ - రునిధనుద్రుంచి - తనుగోరుచు
న్నయ - వనిజయాసీ - తనుగనివరించి - శ్వశురునియనుమ
తం-బునుబడసిరా - గినుకచేగడు - జెనకిభార్గవుడడ్డగించగ-
ననిలోనాతనిమదమణచిపురమునుప్రవేశముజేసివెలసిన॥శ్యా॥
౨॥ సరగునబితృవాక్య- పరిపాలనమొనర్చ- కొరకుసౌమిత్రిని-
ధరణిజను-వరుసచేదోడ్కొ-ని-వనికేగిమారీచు-నిరసించి-వా
సుధేయిని-బరికించి-కానకనె- కాననుజరయించియంతటజటా

యువు-సరసకు వెడలి- తెరగు దెలిసికొని - కరమాదరమునశ-
బరియొసగుమ్మృదు - తరఫలములగొని- హరిసుతుంబొరిగొని
హరితనూభవు-బరగనేలుకొని- హరిసంభవునిగని-కరమునబి
లిచియానవాలుం-గరమునతనికినొసగిరత్నా-కరము మేరంగ
ల్గులంక-స్స్వరమణిని-వెదకుటకు దోలిన॥ శ్యామ॥

౩॥ పొందుగ వనచర-బృందములునుముందు-ముందునడువగానం
దముచే-సందర్శించుచుభాను-నందనునితోన రగిర-వాండ గను
సింధువునకైశర-మందగను - వెరపుచేనదిమద్ది - గుండగను
కృపయుంచినీరధి- యందు సేతువు - నలరబంధించి - లంకం
జరించుచు-నందముగబాణంబుసంధించి - యనిమిషచయం
బరు - దండదశకంధరునిఖండించి-తగుపుడమిచూలిని-సంది
యంబందక నెచేకొని-వందివర్గమువొగడనత్తరి- యంద యో
ధ్యను జేరివిభవపు -రందరుండై రహిజెలంగిన॥ శ్యామ॥

మోహనరాగము. - రూపకతాళము.

పల్లవి॥ చూచితివెరాముని - జూడ్కులలర॥ జూచితివె॥
అనుపల్లవి॥ రాచకొమరుడై సుజనులను -బ్రోచునట్టిప్రభునినదుగా॥

౧॥ రవికులాబ్ధికై-రవసఖుడగు-ప్రవిమలాత్ముని - భవదూరుని-
భువన మోహనస్వరూపుని-సవిన యైక గుణకలాపు ॥జూచితివె
౨॥ వాసిగలచిద్వి-లాసురావ-ణాసురారిని - కౌసలేయు - భాసి
లుసీతాసమేతుని-వాసవనుత-వేసరకనె॥ చూచితివె
౩॥ వాలినిదునిమి - వైళముచే - హేళిజునెలమి - నేలినట్టి-శ్రీ
లసురపురీనివాసుని-నీలదేహునిగమవేద్యు॥ జూచితివె॥

కేదారగౌళరాగము - రూపకతాళము

పల్లవి॥ రామచంద్ర శ్రీవాసుధేయా - రమణసలహృద్యై ॥రామ॥
అనుపల్లవి॥ సోమవరద - సురపురీశ - ప్రేమదిందలి॥ రామ॥
౧॥ దురుళనాగిబిడ దెనిన్నను - శరణుపొక్కిరె - భరదికా
కాసురనకాయ్దు - తెరదిమన్నిసి॥ రామ॥

